4-10-1991 శుక్రవారం 10 పేజీలు సంపుటి : 62 సంచిక 39 విడిప్రతి : రు 1.50లు

# జమీన్‌రైతు



స్థాపకుడు : నెల్లూరు వేంకటరామానాయుడు

# కోట్ల, వైఎస్ భాయి భాయి?

రాష్ట్ర రాజకీయాలు చిత్ర, విచిత్ర మార్పులకు లోనౌతున్నాయి; ఊహించని మలుపులు తిరుగుతున్నాయి. కోట్ల విజయ భాస్కరరెడ్డి, డాక్టర్ వైయస్ రాజశేఖర్ రెడ్డి - ఒక ఒరలో ఇమడని రెండు కత్తులు. రాయల సీమ రాజకీయం పై పెత్తనం కోసం ఇద్దరూ శక్తి వంచన లేకుండా ప్రయత్నిస్తుంటారు. ఆయనది పాత తరం నాయకత్వం - ఈయనది నవతరం ఉడుకు రక్తం. కడప పార్లమెంటరీ ఉప ఎన్నికలో ప్రధాని శ్రీ పి.వి పోటీ చేయకుండా జరిపిన లాబీయింగ్‌లో విజయ భాస్కర రెడ్డిది ప్రధాన పాత్ర. రాజశేఖర్‌రెడ్డి " సీఎం " పదవింపుకోవ దానికి ముఖ్యమంత్రి శ్రీ జనార్దన రెడ్డి ఇప్పటి వరకు విజయ భాస్కర రెడ్డి నే సాధనంగా వాడుతున్నాడు. రాజశేఖర్ రెడ్డి వల్ల వీరిద్దరికీ ఒకే విధమైన వైముఖ్యం వుంది. తన పదవికి ప్రక్కలో బల్లెంగా జనార్దనరెడ్డి భావిస్తే, తన పెద్దరికానికి ప్రమాదంగా విజయ భాస్కర రెడ్డి భావిస్తుంటాడు.

నిన్నటి వరకు ఈ రాజకీయం తీరు ఇదీ ! కాని ఇప్పుడది తలక్రిందులైంది రాజశేఖర్‌రెడ్డి, విజయ

## తలక్రిందులైన రాష్ట్ర రాజకీయం

భాస్కర రెడ్డి లిద్దరూ ఇప్పుడు జనార్దన రెడ్డిని తమ ఉమ్మడి శత్రువుగా భావిస్తున్నారట. అందువల్ల ఇద్దరూ కలిసి సయోధ్యకు మంతనాలు సాగిస్తున్నారు. ముఖ్యమంత్రి పదవిపై అపరిమిత మోహం పెంచుకున్న వీరిరువురూ ముందు ఉమ్మడి పోరు సాగించి, పదవి ఖాళీ అయిన తర్వాత తమలో తాము బలాబలాలు చూసుకో వాలనే నిర్ణయానికి వచ్చారని విశ్వసనీయ వర్గాల భోగట్టా.

రాజకీయాలలో శాశ్వత శత్రుత్వాలు, మిత్రుత్వాలు వుండవు. ఎప్పటికెయ్యది ప్రస్తుతమో అప్పటికా దారి తొక్కడం రాజనీతిజ్ఞుల లక్షణం. కాని జనం మాత్రం ఈ అడ్డదార్లను గమనిస్తూనే వుంటారు - అవకాశం దొరకగానే బుద్ధి చెప్తారు !

### దిగజారిపోతున్న శాసన సభ హుందాతనం

మొన్న ముగిసిన బడ్జెట్ సమావేశాల ధోరణి చూస్తే రాష్ట్ర శాసన సభ హుందాతనం ఎంతగా దిగజారిపోతోందో అర్థమవుతుంది. ప్రజాస్వామ్య వ్యవస్థకు పట్టుగొమ్మగా ప్రజాసమస్యల చర్చకు వేదికగా ఉపయోగపడాల్సిన శాసన సభ "నువ్వెంత అంటే నువ్వెంత ? " అన్న రీతిలో వ్యక్తిగత నిందలతో, రాజకీయ దిగజారుడు భాషతో హోరెత్తింది. ఫలితంగా ప్రభుత్వ శాఖలకు చెందిన సంబంధై రెండు పద్దులు ఏ చర్చా లేకుండానే గిల్లెటిన్ అయ్యాయి. దీనంతటికీ కారణం ప్రతి పక్షీయులేనని అధికార పక్షంవారు, కాదు ఇదంతా ఏలేవారి చలవేనని ప్రతిపక్షం వారు పరస్పరం నిందించుకుంటున్నారు. శాసన సభ సమావేశాలు జరిగిన తీరు గమనిస్తే ఇందుకు 'అందరూ' బాధ్యులే అనిపించక మానదు. శాసన సభ సమావేశాన్ని సవ్యంగా , శాంతియుతంగా జరిపించుకోవాల్సిన బాధ్యత అధికార పక్షం మీద వుండగా, అందులో కొందరు ఆయిన దానికీ కానిదానికీ ప్రతిపక్షీయుల మీద వ్యంగ్య వ్యాఖ్యలు విసిరి అనవసరమైన రచ్చను కొనితెచ్చుకున్నారు. వీళ్లకంటే మేం మాత్రం తీసిపోయామా, అంటూ ప్రతిపక్షీయులు ముఖ్యంగా తెలుగుదేశం ఎమ్మె ల్యేలు ఉన్నవి లేనివీ కలిపి అధికార పక్షంమీద దుమ్మెత్తిపోసి పలుమార్లు సభను స్తంభింపజేశారు. 'ఎవరు ఎక్కువగా నోరు పెట్టి అరిచి రచ్చచేస్తే వాళ్లదే పైచేయి ' అన్న ధోరణి ఎమ్మెల్యే ల్లో నాటుకు పోవడంతో శాసన సభ హుందా తనం నీరు కారిపోయింది. మొత్తం మీద సంబధై మూడు రోజుల తర్వాత శాసన సభ సమావేశాలు ముగిశాయి.

# గ్రానైట్ విలువ మూడువేల కోట్లా? హవ్వ

ఒక వ్యక్తి మీద ఆరోపణ చేసే ముందు వెనకా ఆలోచించటం, మనం చేసే ఆరోపణకు దాఖలా లున్నాయా లేదా, అన్నది చూసుకోవడం పాత ఫ్యాషన్ అయిపోయింది. "ఎద్దు ఈనింది రా అంటే ... దూడను కట్టేయండి" అన్న పరిస్థితి నెలకొన్నది ముఖ్యమంత్రి కుమారుడికి కేటాయించిన గ్రానైట్ భూమి లీజు దానికి చక్కని ఉదాహరణ. ఎకరా ఇరవై వేల రూపాయలకు కూడా పలకని భూమి ప్రతిపక్షాల చలవ వల్ల కోట్లాది రూపాయలకు చేరింది. భూగర్భ సర్వే నిపుణుల అంచనా ప్రకారం ముఖ్యమంత్రి కుమారుడికి కేటాయించిన 60ఎకరాల పరిధిలో సుమారు 80 లక్షల రూపాయలు విలువ చేసే బంగారు వన్నెగల గెలాక్సీ గ్రానైట్ ఉన్నట్లు తెలుస్తోంది. అయితే ప్రతిపక్షాలు ఈ మొత్తాన్ని మూడు వేల ఏడు వందల కోట్ల రూపాయలకు పెంచేశాయి. కనీసం ఏవేవారికైనా ప్రతిపక్షాల అంచనాలు సబబుగా ఉండాలన్న విచక్షణ కూడా లేకుండా పోయింది. మొత్తం మీద వివాదానికి కారణమైన గ్రానైట్ జీవోను ఉపసంహరించుకొని ముఖ్యమంత్రి అడుసు కడుక్కున్నారు. అయినా ముఖ్యమంత్రిపై ఇది 'మచ్చ'గా మిగిలిపోయింది.

అలాగే మద్యం అమ్మకం పన్ను రాయితీలను పాత కాలం నుంచి చెల్లిస్తూ జారీ చేసిన ఉత్తర్వులు కూడా ముఖ్యమంత్రి శీలానికి అగ్ని పరీక్ష అయ్యాయి. ఈ జీవో వల్ల ప్రభుత్వ ఖజానాకు నూటడెబ్బయ్ కోట్ల రూపాయల మేరకు నష్టం వాటిల్లగలదని ప్రతిపక్షాలు ఆరోపించాయి. దీనితో ఈ

## వ్యక్తిగత ఆరోపణల యుద్ధంలో విలువలకు దహనసంస్కారం

జీవోను కూడా ముఖ్యమంత్రి రద్దు చేశారు.

ముఖ్యమంత్రి ప్రమేయం లేక పోయినా, ఆయనకు ప్రయోజనం చేకూరినా, చేకూరక పోయినా, జీవోల రద్దువల్ల ముఖ్యమంత్రి న్యూనతా భావం బయట పడిందని అటు ప్రతిపక్షం, ఇటు స్వపక్షంలోని అసమ్మతీయులు ముఖ్యమంత్రిపై బురద చల్లుతున్నారు.

### కలత చెందిన ముఖ్యమంత్రి

తనపై ఇంటా బయటా ఆరోపణలు రావడంతో ముఖ్యమంత్రి కలత చెందినట్లు తెలుస్తోంది. ఒకవైపు ప్రతిపక్షం, మరోవైపు అసమ్మతీయులు, ఇంకోవైపు హైకోర్టులో కేసులు ముఖ్యమంత్రిని చీకాకు పరుస్తున్నాయి. ముఖ్యమంత్రి పదవిలోకి వచ్చిన మొదటి మూడు నెలలు ఎన్.జనార్దన రెడ్డి పై కనీసం వేలెత్తి చూపేవారు కూడ లేరు. సర్వత్రా జనార్దన రెడ్డి పరిపాలన బాగుందన్న ప్రశంసలు వినిపించాయి. గడచిన ఆరునెలల కాలంలో ముఖ్యమంత్రి పీకలదాకా అవినీతి ఆరోపణల్లో కూరుక పోయారు. దీనికి కారణం ఏమిటి? చుట్టూ చేరిన అధికారగణం 'శల్య' సారథ్యమని ముఖ్యమంత్రి హితవు కోరుకునే వారి మాట. శాసన సభసమావేశాలు జరిగే సమయంలో ముఖ్యమంత్రి కుటుంబ సభ్యుల ప్రమేయం ఉన్న ఉత్తర్వులు జారీ చేయొచ్చా ? ముఖ్యమంత్రి మొప్పు కోసమో, ఆయన కుమారుడ్ని సంతోష పెట్టాలన్న 'ఆత్రుత ' లోనే అధికార గణం చేసిన తొందరపాటు ముఖ్యమంత్రి పాలిట శాపమైంది.

### పులివెందల లో భావి రాజకీయం

రాష్ట్ర భవిష్యత్ రాజకీయాలు ఇప్పుడు పులివెందలపై ఆధారపడి వున్నాయి. కడపను తన తమ్ముడికి బదలాయించి, పులివెందల రూట్‌లో అసెంబ్లీకి ప్రయాణం కట్టాలని డాక్టర్ వైయస్ రాజశేఖర రెడ్డి ప్రయత్నం. రాష్ట్ర నాయకత్వానికి పార్లమెంట్ సభ్యులు అనర్హులనే సూత్రం కాంగ్రెస్ పెద్దలు గట్టిగా అమలు పరుస్తుండడంతో, రాజశేఖర్ రెడ్డికి కడప సీటుపై అణుమాత్రం ఆసక్తి లేదు. ఒక సారి అసెంబ్లీలోకి ప్రవేశిస్తే, ఆ తర్వాత అవకాశం ఎప్పుడు వచ్చినా అందిపుచ్చుకోవచ్చు!

అయితే ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దనరెడ్డి ఈ ప్రయత్నాలకు అడుగడుగునా గండి కొడుతున్నాడు. చూస్తూ, చూస్తూ శత్రువును తానున్న ఇంటికి రానివ్వడం వివేక వంతులు చేసే పని కాదు కదా! ఖాళీగా వున్న కడపను కాదని, శ్రీ పివి కోసం నంద్యాల సీటును ఖాళీ చేయించడం వెనుక వున్న అంతర్యం అదే! పులివెందలలో వైఎస్‌కు టికెట్ రాకుండా చేయడానికి ఆయన ఢిల్లీ స్థాయిలో ఒత్తిడి తెస్తున్నాడు. ఇద్దరు నాయకుల మధ్య ఇప్పుడిదొక తాజా ప్రతిష్ఠా సమస్య అయింది. కడప సీటు ఎంపిక విషయంలో ప్రధాని శ్రీ పివి ముఖ్యమంత్రి వైపే మొగ్గుచూపాడు. ఇప్పుడూ అటే తల ఆడిస్తే, వైయస్‌కు ఢిల్లీ వెళ్ళడం తప్ప గత్యంతరం లేదు; ప్రక్కనే వున్న నంద్యాలలో తాను పోటీ చేస్తూ, అక్కడ పలుకు బడి కల్గిన రాజశేఖర రెడ్డి ఆయుష్షతకు గురి కావడానికి ప్రధాని సిద్ధపడతాడా అన్నది ప్రశ్న. ముఖ్య మంత్రిని సంతుష్టి పరచడం కంటే, తన పదవిని తాను కాపాడుకోవడం పివి కి ప్రధానం కదా? అయితే రాజశేఖర్ రెడ్డికి అసెంబ్లీ టికెట్ ఇస్తే - అది అసమ్మతికి తన ఆమోద ముద్రగా పార్టీ కార్యకర్తలు భావించే ప్రమాదం వుందని పివి భయం.

పులివెందలలో వైఎస్ పోటీ చేయగల్గితే రాష్ట్ర రాజకీయాలు నూట ఎనభైయారు డిగ్రీల జ్వరంతో ఉడుకెక్కి పోతాయి; టికెట్ తెచ్చుకోవడంలో విఫలమైతే అసమ్మతి ఉద్యమాన్ని మంచు తెరలు కప్పివేస్తాయి.

# ఎక్కడలేనిచీకాకుకల్గిస్తున్న ఎమ్మెల్యేలనిరుద్యోగసమస్య

నెల్లూరు జిల్లాకు సంబంధించినంతవరకు శాసన సభ్యులలో నిరుద్యోగ సమస్యను నిర్మూలించడానికి ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దనరెడ్డి గట్టి ప్రయత్నమే చేస్తున్నారు. పూర్వపు రోజులలో శాసన సభ్యత్వమే పెద్ద పదవిగా పరిగణించబడేది. ప్రజలతో సన్నిహితంగా మెలగడమే రాజకీయం అన్న పాతరోజులనాటిమాట అది. అందువల్ల సీనియర్ లైన ఏకొద్దిమంది మాత్రమే మంత్రిత్వంకోసం ప్రయత్నించేవారు. మంత్రులతో, ముఖ్యమంత్రులతో సన్నిహితంగామెలగి తమతమ రాజకీయ పలుకుబడిని పెంచుకోవడానికి, తమ తమ నియోజక వర్గాల అభివృద్ధి చేసుకోవడానికి శాసన సభ్యులు ప్రయత్నించేవారు. అందువల్ల అటు మంత్రులకు, ఇటు ఎమ్మెల్యేలకు కూడా ప్రజలలో విలువ, గౌరవం వుండేవి.

ఇప్పుడా సంస్కృతికి నూకలు చెల్లిపోయాయి. ఖద్దరు చొక్కా తొడిగే ప్రతివాడికీ ఎమ్మెల్యేకావాలని ఆశ; ఎమ్మెల్యే అయిన మరుక్షణం నుంచి మంత్రికావాలని ఆరాటం ; మంత్రి అయిన మూడవ రోజునుంచి ముఖ్యమంత్రి పదవిపై మక్కువ. రాజకీయ విలువలు పతనమయ్యే కొద్దీ, పదవుల ప్రామాణికత కూడా దిగజారిపోతుంది. ఏ పదవికీ అర్హత అవసరమన్నదే లేకుండా పోతున్నది. అందువల్లే ప్రతి ఎమ్మెల్యే లైటున్న కారుకోసం వెంపర్లాడుతున్నాడు. ఆ

**పెంచలయ్య మనస్తాపం**
**యానాదిరెడ్డి ఆకలికేకలు**

కారులో తిరగగల్గితేనే రాజకీయం చేసినట్లు భావిస్తున్నారు. ముఖ్యమంత్రుల ప్రాణాలు తోడేస్తున్నారు.

నెల్లూరు జిల్లాలోని పదకొండుమంది ఎమ్మెల్యేలలో ఒక్క అల్లూరు విష్ణువర్ధనరెడ్డి తప్ప, ప్రమోషన్ కోసం తపనపడని వారేలేరు. జనార్దనరెడ్డిగారు కుంభస్థలమే కొట్టి ముఖ్యమంత్రి అయిపోయారు. నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డిగారు మంత్రి పదవి ఇస్తే, కోటవాకాడు వైరానికి తెరదించి, జనార్దనరెడ్డి కంటే సుందరాకారుడు, సద్గుణవంతుడు, స్నేహితుడు భూమండలమందంతావెదికినా కన్పడడని ఊరూరా చాటిన్నా తిరగడానికి సిద్ధపడ్డాడు. ప్రమాణస్వీకారోత్సవానికి పిలుపువస్తుందని ఫోన్ దగ్గరే ఏదో సామెత చెప్పినట్లు, రోజంతరపడి కాపేసి కూర్చున్నాడు. పాపం ఆయన కోరిక తీరలేదు; జనార్దనరెడ్డిగారు తీర్చలేదు.

ఆయనకు పట్టాల్సిన అదృష్టం శ్రీ మాదాల జానకిరాంను వరించింది. జానకిరాం నిజంగా మహర్జాతకుడే! ఎమ్మెల్యేగా ఎన్నికైన తొలిసారే మంత్రి అయ్యాడు. నూటికి పదిశాతం మందికి కూడా ఈ అవకాశం లభించదు.

జానకిరాం మంత్రిత్వం దక్కిన ఎమ్మెల్యేలలో తపనం తేనెతుట్టెను కదిలించింది. ముఖ్యమంత్రికి మనశ్శాంతిని కరువుచేసింది. జనార్దనరెడ్డి ప్రాణం

(కొరవ 6 పేజీ లో)

## నెల్లూరు మునిసిపాలిటీ వారి ప్రకటన

ROC No15913/91/ఎ1 30.9.91 తేది

బలగం వెంగళరావు మునిసిపల్ బిల్డింగులోని 16వ నెంబరు షాపు రూము అనిల్ కుమార్ అగర్వాలా ప్రొప్రయిటరు, సింఎంటర్ప్రైజెస్ వారు వాడుకొను చుండి బాడుగలు సక్రమముగా చెల్లించక మునిసిపాలిటీ వారికి స్వాధీనము చేయక సదరు కొట్టుకు తాళమువేసి యున్నారు. ఒరిజినల్ గుత్తదారుడు ఏలూరు రాజగోపాల్ రెడ్డి గాని మరియు అనిల్ కుమార్ అగర్వాలాగాని 10.10.1991 తేదీలోగా తక్షణమే చెల్లించవలసిన బకాయిలు పూర్తిగా చెల్లించి షాపు రూము మునిసిపాలిటీకి స్వాధీనపరచవలసినదిగా అట్లు స్వాధీనపరచని ఎడల సదరు కొట్టు తాళము పోలీసు సమక్షంలో పగులగొట్టి స్వాధీనము చేసుకొని చట్టరీత్యా చర్య తీసుకొనబడునని ఇందుమూలముగా తెలియపరచడమైనది.

— జి. రామనారాయణ రెడ్డి
కమీషనరు.



## ఉత్తర క్రియలు



మాతండ్రి

**శ్రీ నెలబల్లి జనార్దనరెడ్డి**

28.9.91 తేదీ శనివారం స్వర్గస్థులైనారు.
వారి ఉత్తరక్రియలు
8.10.91 మంగళవారం - నిలుపు
9.10.91 బుధవారం - ఎత్తురేపు.
గూడూరులో మాస్వగృహమున
జరుగును. బంధుమిత్రులు తెలియగోరుతాము.

నెలబల్లి పార్థసారథిరెడ్డి
నెలబల్లి సతీష్ రెడ్డి

## శ్రద్ధాంజలి



నిష్కళంకుడు, నిస్వార్థపరుడు
మాకు అత్యంత అభిమానపాత్రుడు
మాసోదరుడు

**శ్రీ నెలబల్లి జనార్దనరెడ్డి**

28.9.91 తేది హఠాత్తుగా
స్వర్గస్థుడైనాడు. ఆయన పవిత్రాత్మకు
భగవంతుని సన్నిధిలో చిరశాంతి
కలగాలని ప్రార్థిస్తున్నాము.

నెలబల్లి సుబ్బారెడ్డి
నెలబల్లి శ్రీనివాసులు రెడ్డి

# జమీన్‌రైతు

## పోటీపెట్టవద్దు!

ప్రధాని శ్రీ పివి నరసింహారావు నంద్యాలం నుంచి లోక్‌సభకు పోటి చేయడం ఖాయమని తేలిపోయింది. విజయ దశమి పర్వదినాన ఆయన నామినేషన్ దాఖలు చేయవచ్చు.

దేశ రాజకీయాలలో ప్రధాన పాత్ర వహించే నాయకులను ఆదరించడంలో నంద్యాలకు ఘన చరిత్రే వుంది. ఇక్కడ నుంచి గెల్చిన తర్వాతే, శ్రీనీలం సంజీవ రెడ్డి లోక్‌సభ స్పీకర్‌గా ఎన్నికైనాడు. ఆ పిమ్మట రాష్ట్రపతిగా ఎదిగాడు. కేంద్ర హెూం మంత్రిగా, గవర్నర్‌గా పనిచేసిన శ్రీ పెండేకంటి వెంకట సుబ్బయ్య స్వనియోజక వర్గమూ నంద్యాలే! ఇప్పుడీ స్థానం నుంచి సాక్షాత్తు ప్రధాన మంత్రి పోటి చేయబోతున్నాడు.

నామినేషన్ దాఖలు చేయడం లాంఛన ప్రాయమనే తప్ప, నంద్యాలను ఎంపిక చేసుకున్న నాడే శ్రీ పివి ఎన్నికైపోయినట్లే లెక్క. తెలుగు జాతి గర్వించే రీతిలో ఒక తెలుగు బిడ్డ ప్రధాని అయిన సందర్భంలో, ఆయన్ను తమ ప్రతినిధిగా ఢిల్లీకి పంపడంలో నంద్యాల ప్రజలు వెనుక ముందులాడుతారని భావించలేము. పివిని అఖండ మెజారిటీతో గెల్పించడం, వారిని వారు గౌరవించుకోవడమే అవుతుంది.

అయితే, నంద్యాలలో పోటి పెట్టడానికి తెలుగుదేశం, బిజెపి పార్టీలు ప్రయత్నం చేయడం మాత్రం సమంజసంగా లేదు. ఎంత గట్టి అభ్యర్థిని రంగంలోకి దింపినా గెలవడం అసాధ్యమన్న సంగతి ఆ పార్టీల నాయకులకు బాగాతెలుసు. కాని కాంగ్రెస్‌కు పోటి పెట్టకుంటే తమ కెక్కడ నష్టం జరుగుతుందో నన్న సందేహంతోనో, లేక ప్రధానిపై పోటి పెట్టి కాంగ్రెస్‌తో తమకు ఎటువంటి లాలూచీ లేదని నిరూపించుకోవడానికో వీరు ఆ ఆలోచనలో వున్నట్లుంది. ఇవి రెండూ సహేతుకమైన ఆలోచనలు కావు. సంకుచిత రాజకీయ దృక్పథంతో చేస్తున్న ప్రయత్నాలివి. ఒక తెలుగు బిడ్డ దేశ ప్రధానిగా బాధ్యతలు నిర్వహించడమే అపూర్వమైన విషయం. అందులోనూ శ్రీపివి కాంగ్రెస్ సంస్కృతికి భిన్నమైన విశిష్ట వ్యక్తిత్వ భూషణుడు. యాభై ఏళ్ళ సుదీర్ఘ రాజకీయ చరిత్రలో వేలెత్తి చూపడానికి మచ్చలేని నాయకుడాయన. ఎంత పెద్ద పదవిలో వున్నా, ఏ పదవిలోనూ లేకున్నా, వివాదాలకు అతీతంగా వ్యవహరించగల ఉదాత్త గుణం ఆయనది. నేషనల్ ఫ్రంట్, బిజెపిలలో ఎవరు తుమ్మినా తన ముక్కు ఊడిపోయే పరిస్థితిలోనూ ఆయన ప్రధానిత్వాన్ని ఎంత హుందాగా, ఎంత గంభీరంగా నడుపుకపోతున్నాడో మనం చూస్తూనే వున్నాం. కాంగ్రెస్‌లోని విష సంస్కృతు లేవీ వంట బట్టని పివి నరసింహారావు గారిని ఏకగ్రీవంగా గెల్పించడం, తెలుగు ప్రజలందరి కర్తవ్యం. తెలుగు ప్రజల సౌహార్ద్రతను, సంఘీభావాన్ని చాటడానికైనా - తెలుగుదేశం, బిజెపి నాయకులు తమ పోటి ప్రతిపాదనను విరమించుకోవాలి. నామినేషన్ల సమయంలో శ్రీపివితో పాటుగా హాజరై, తమ తమ పక్షంగా ఆయన పేరును ప్రతిపాదించాలి. ప్రధానిగా పనిచేస్తున్న తొలి ఆంధ్రుడిపై పోటిపెట్టడం ఆంధ్రులకెవరికీ గౌరవ ప్రదం కాదు.

నంద్యాలలో పోటి విరమించుకొనే పక్షంలో తమకు అళ్ళ గడ్డ శాసన సభాస్థానాన్ని వదలివేయాలని తెలుగు దేశం బేరం పెడుతున్నట్లు వార్తలందుతున్నాయి. ఇది నీచరాజకీయ సంస్కృతి. పివి ఓడిపోతాడనే భయంతో ఎవరూ ఏకగ్రీవం కోరడం లేదు. తెలుగుజాతి గౌరవం ఇనుమడింప జేయడానికి చేస్తున్న ప్రతి పాదనే తప్ప, ఓటమి భయం కాదు. బేరం కుదుర్చుకుని పోటి లేకుండా చేసుకోవడం కంటే, పోటికి నిలబడి గెలవడమే శ్రీపివికి సమ్మతమౌతుంది. ఈతేడాను గ్రహించి, తెలుగుదేశం అధినేతలు తమ సంకుచిత, స్వార్థ దృక్పథాలను విడనాడి, తెలుగుజాతి ప్రతిష్టను పెంచడంలో తమ వంతు కర్తవ్యాన్ని నెరవేర్చాలి!

## 50 ఏళ్ల క్రితం ఈ వారం

జమీన్‌రైతు

4- 10 -1941

8 పేజీలు : అణా.

### గూడూరులో పులులు

మామూలు ప్రకారం వేశారు. ఇవి మహమ్మదీయులను కరవలేవు; మహమ్మదీయులు హిందు పులులను పెరకనూలేరు; గెలిటిదాందుద్ధ కర్రతో బాదనూలేరు.

### కలువాయి అరెస్టు

నాగిరెడ్డి వెంకురెడ్డిగారు శనివారం నాడు వీధిలో హిందూ మహాసభకు జై అనికేకలువేసినందుకు రాత్రి 8 గంటలకు అరెస్టు చేయబడి ఆదివారం ఉదయంకావలిడిప్టీ మేజిస్ట్రేటు సుల్తాన్ మొహిదీన్ గారిచే విచారణచేయబడి అప్పుడే 8గో... శిక్షవిధింపబడెను. జిల్లా కోర్టులో 2 తేది బెయిలు మీద విడుదలచేసిరి. 3తేది హియరింగు జిల్లాకోర్టులో జరుగుతున్నది.

### నెల్లూరులో సినిమాలు

వారాన్నుండి రెండు హాలుల్లో సినిమాలులేవు. యీదినమునుండి "వినాయకహాల్లో" "క్రిమినల్ అనే హిందీ చిత్రమున్నూ. "క్రొత్తహాల్లో" బొండాంపెళ్ళి మళ్ళీ వేస్తారట.

### నెల్లూరు ముచ్చట్లు

#### కలెక్టరు శెలవు

జిల్లా కలెక్టరు కరంతుల్లా సాహెబు గారి శెలవు రద్దు చేయబడినదట. ప్రజలుగొల్లుకోరితే ప్రభుత్వమువారు రాయి చేతుల్లో బెట్టారేమి?

#### గాంధీ జయంతి

నెల్లూర్లో గాంధీ జయంతి ఉత్సవానికి గూడ లైసెన్సు నిరాకరించారు. ఔను! మహావాక్యాయ కర్మలందు అహింసావ్రతోద్ధారకునికి ఈ శాస్తి జరుగవలసిందే!

నెల్లూరు యానాది హాస్టెల్లో మాత్రం 2 తేది గాంధీజయంతి జరిగింది. 45 మంది స్త్రీలు ఆసగలంతా వడికి గాంధీ గారికి 73 వేల గజాలనూలు పంపిరి.

#### నూలారుపేట మంత్రసాని

డాక్టరుగారూ! కాన్పుకేసు లలో నాయుడు పేట మంత్రసానిని పిలిపించమని వ్యక్తులను తాముకోరడం, ఆమెరావడం, ఇద్దరు మంత్రసానులు సవతుల కొట్లాట మాదిరి పోట్లాడు కోవడం ఏమిటండీ?

ఇకనన్నా అలా చేయరు గదా?

#### మాయిమడుగు మునసబ్

పిల్లిమబ్బారెడ్డి, కరణం చార్జి యివ్వమని యిస్పేటు చెప్పినా ససేమిరా అని తిరగబడ్డాడట. క్రిమినల్ కంప్లైంటు ఎస్టేటు వేత్నోనే పెట్టబోతున్నదని వార్త

పనూలు చేసిన బాపు 20 పుట్ల లెక్కలు తేండంలేదట. సెకండు ప్రిన్సు గారూ ఏమిటీ పరిపాలన?

#### మోపూరు కొత్తరెడ్డి

కొత్తరెడ్డి రైతులవద్ద కొంత పనూలుచేసి రసీదులు ఇవ్వలేదని మొత్తుకుంటున్నాడు. ఎస్టే[illegible] [illegible] మురదాష్టించకుంటే ఎట్లా?

#### సినిమా వార్తలు

రేణుకాఫిలిమ్స్ వారిప్రయత్నం ఏరూపంలో వుందో రైటరు సత్రం "రేడియోస్టేషన్ నుండి వార్తలు సరిగా వినపడడంలేదు.

× × ×

జమ్నీసిక్చర్సు వారి ప్రదమ తెలుగు చిత్రం "జీవన్ముక్తి" నవంబరులో [illegible] విజయయాత్రచేస్తుందట. వీరు ద్వితీయ తెనుగు చిత్రం కూడా తీస్తారని, అందు ప్రదానరాణి కాంచన మాలగా వుంటుందని తెనుగు వారు అప్పుడే లొట్టలేస్తున్నారు.

# దేశంబాగుపడేమార్గమేమిటి?

## జనవాణి

గత ఆగస్టు15 స్వాతంత్ర్యదినం హిందూ పత్రిక మొదటి పేజీ ప్రముఖంగా "కహాగయే ఓలోగ్" అనే అడ్వర్టయిజ్ మెంటు ఉండింది. అది ఇది :

వందేమాతరం

ధీకరంగా "వందేమాతరం" అని నినదిస్తూ వారు తమ ప్రాణాలర్పించారు. త్రివర్ణపతాకాన్ని సగర్వంగా ఎగురవేస్తూ వారుతీరని కష్టాలు అనుభవించారు. మాతృదేశ స్వాతంత్ర్య సిద్ధికి పోరాడుతూ వారుతమ సర్వస్వం త్యాగం చేశారు. ఆభారతపుత్రులు ధన్యజీవులు; వారినికని, పెంచిన ఆమహాతల్లులు ధన్యులు. అబ్బా! వారు ఎంత మహోన్నతులో కదా!

మరి ఈనాడు మనకు ఎలాటి వారున్నారో చూడండి!

దేశాన్ని చీలుస్తూ; ప్రజలను విభజిస్తూ; ఒకరినొకరుక్రిందకులాగి పడేస్తున్నారే-

వీరి ఈ గుడ్డి ప్రవర్తన అంతా అధికార దాహం, ధనాశ, స్వార్థ ప్రయోజనాలకే గదా!

ఏ నాటికైనా శాంతి సుఖం వుంటాయని ఆశించగలమా ?ఏనాటికైనా భారత దేశాన్ని సంపన్నం చేయగలమా? విచక్షణా శక్తిగల పౌరులైన మనందరి హృదయాలను కలవర పెడ్తున్న ఈ ముఖ్య సమస్యలను ఈ చారిత్రాత్మక దినాన లోతుగా ఆలోచించమని ప్రార్థేయ పడుతున్నాం.

అమర్సన్స్ వారిప్రకటన లోని ఆ సుభాషితాలు ఈ నాడు ఎంత నిజమో చూడండి ?

20.9.91 వతేదీన కేరళ రాష్ట్ర ఇన్ స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీసు డాక్టరు పిజె అలెగ్జాండర్ ఇండ్లమీద సి.బి.ఐ అధికారులు మమూరు మూట ముప్పయ్ మంది దాడిచేసి, అలని ఆదాయానికి

( కొరవ 6 పేజి లో)

## ● ఉత్తర క్రియలు ●

మా సోదరుడు

### యిన్నమూరి కోటేశ్వరరావు

(మహారాణి షోరూమ్ - కాపువీధి - నెల్లూరు)

26-9-91 తేది గురువారం ఉదయం స్వర్గస్థులైనారు.

వారి ఆత్మశాంతికై భగవంతుని ప్రార్థిస్తున్నాము.

వారి ఉత్తర క్రియలు

10-10-91 గురువారం శిలోద్వాసన

11-10-91 శుక్రవారం పాత్తర్లు, వైకుంఠసమారాధన

నెల్లూరు తిప్పరాజు వారి వీధిలోని మా స్వగృహమున జరుగును

బంధు మిత్రులు తెలియగోరుతున్నాము.

యిన్నమూరి వెంకటేశ్వరరావు, ప్రసాదరావు, ఉదయ భాస్కరరావు, లీలాకృష్ణమూర్తి

వీరాంజనేయరావు, సోదరి - జయలక్ష్మి

తల్లి - పార్వతి దేవి భార్య - అలివేలు, కుమార్తె - శిరీష, కుమారుడు - పురుషోత్తం కుమార్

మరదళ్ళు - రాజేశ్వరి, సత్యవతి, ప్రమీల, మల్లీశ్వరి, విజయలక్ష్మి

# తాటిచెట్టుఅభివృద్ధికి పరిశోధన ప్రారంభంకావాలి

'గ్రీన్ రెవల్యూషన్' ఉద్యమంలో వ్యవసాయ పరిశోధన మూడు పూలు ఆరుకాయలుగా విస్తరిల్లింది. ఆకృషి నిరంతరం కొనసాగుతున్నది. ఆహారధాన్యాలకు సంబంధించేకాదు. పండ్ల వృక్షజాతులు, పూవెగింజలు, కూరగాయలు, ఒకటేమిటి-బహుముఖంగా ఈ పరిశోధన జరిగి సత్ఫలితాలనిచ్చాయి. దీని మూలంగా దేశానికి, రైతాంగానికి, వినియోగదార్లయిన ప్రజాబాహుళ్యానికి ఎంతోమేలు జరుగుతున్నది.

గోధుమ ఉత్పత్తిలో దేశం గణనీయమైన ప్రగతిని సాధించింది. వరికి సంబంధించికూడా విపరీతమైన కొరత స్థితిని అధిగమించి స్వయం సమృద్ధిని సాధించింది; దొరక్కువ అనేది తప్ప బియ్యందొరకక ఆకలితో చచ్చేవాడు ఈ నాడు కనపడడు. వరికి సంబంధించి మనకు తెలుసు ఎన్నెన్ని కొత్తరకాలు వస్తున్నది. దిగుబడి పూర్వం కంటే ఎన్ని రెట్లు పెరిగింది. అదను అనేది లేకుండా ఏ సీజన్లోఅయినా, ఎప్పుడైనా సాగుచేసుకోవడానికి అనుకూలమైన ధాన్యంరకాలు ఎన్ని లభ్యమవుతున్నది మనరైతాంగానికి తెలుసు. పండ్లరకాలలో అత్యంత ప్రియంగా వున్నవి ఎంత తక్కువ ధరకు ఎంత ఎక్కువగా దొరకుతున్నది తెలుసు. దానిమ్మరకాన్నే తీసుకోండి. గతంలో కాబూల్ రకంతప్ప మనకం మంచిరకం దానిమ్మ దొరికేదిలేదు. అదికూడా సంవత్సరంలో ఏదో ఒకసీజన్ లో మాత్రమే. అంతవిలువైన దానిమ్మలో కూడా గింజ భాగం ఎక్కువ. ఇప్పుడు గింజలేని దానిమ్మ రకం వచ్చింది; గింజలేదు. మంచిరుచి, ధరతక్కువ. ఎక్కడికక్కడ

**ఈవిషయంలో ముఖ్యమంత్రి శ్రద్ధచూపాలి**

పుత్పత్తి అవుతూ ఇప్పుడెప్పుడే మార్కెట్‌కు ఎక్కువగా రాసాగుతున్నవి. పూర్వం కాశ్మీర్ ఆపిల్ తప్ప మరొకటిలేదు; ఇప్పుడు అన్నిరోజుల్లో కుక్కను తంతే గంపెడంతగా సందుగొందుల్లో కూడా ఇళ్ల వద్దనే సలీసుగా లభిస్తున్నవి. కొత్తరకం రేగి పండ్లు విస్తారంగా వస్తున్నాయి. జామ విషయం చెప్పనేఅవిలేదు. ఈ విధంగా కొత్తకొత్తగా అనేక పండ్ల రకాల ను పరిశోధన మనకు ప్రసాదిస్తున్నది. మామిడి, జీడిమామిడి, నిమ్మలలో కూడా వగైరా అనేక కొత్తరకాలు వచ్చాయి. చెరకుకు సంబంధించిన పురోభివృద్ధి ఎంతని చెప్పగలం?

కూరగాయల రకాలు పాతవేఅయినా, వాటి లో కొత్తకొత్త రకాలు, వివిధ రుచులలో, తక్కువ కాలంలో ఎక్కువ దిగుబడినిచ్చే రకాలు సాగులోకి వచ్చాయి. ఇప్పుడు ఇంతరుచికరంగా వుంటున్న టమేటో ఇదివరకు మనకెక్కడిది? ఆరునెలలకే కాపునిచ్చే మునగ, వంగ వగైరా రకాలున్నాయి. నూనె కొరతనెదుర్కోవడానికి అధికోత్పత్తి నిచ్చేవేరుశెనగ రకాలను తయారుచేయడమే కాక సాగువిస్తీర్ణాన్ని కూడా అత్యధికంగా పెంచుటకు ప్రభుత్వం కృషి చేస్తున్నది. సోయాబీన్, సామోలిన్ రకాలను ప్రవేశపెడుతున్నది. అడవుల పెంపకానికి తక్కువ కాలంలో

( కొరవ 9 పేజిలో )

# 'ఘనుడు' – పోతన

" ఘనుడా భూసురుడేగినో ..." అన్న పోతన్నగారి పద్యం ఆంధ్రుల కత్యంత ప్రీతిపాత్రమైన పద్యాలలో ఒకటి. అగ్నిద్యోతనుడనే సద్బ్రాహ్మణున్ని తనదూతగా కృష్ణుని వద్దకు పంపిన రుక్మిణి, ఎంతకూ అతడు మగిడిరాక పోయేసరికి, తండ్రి నిర్ణయించిన పెండ్లి ముహూర్తం ముంచు కొస్తున్నకొద్దీ, భయంభయంగా, ఆందోళితమైన మనస్సులో, అనేకానేక సంశయాలకు, సందిగ్ధాలకుమధ్య నలిగిపోతూ తనలో తాను వాపోతూ పలికిన స్వగతమిది. ఇచ్చట రుక్మిణి భూసురునకిచ్చిన "ఘనుడు" అన్న విశేషణం చాలా హృద్యమైనది, ఉచితమైనది. ఆభూసురుడట్టివాడే. ఆయన కూడ "తెన్నల పుణ్యపేటి" యైన పోతన వంటివాడే. అంతేకాదు "ఘనుడు" అన్నశబ్దానికి 'మేఘుడు' అన్న అర్థం కూడా వున్నది. కాళిదాసు మేఘునిదూతగా ఎన్నుకొన్నాడు. కారణం మేఘుడు ఆర్ద్రహృదయుడు! ఆశ్రిత వత్సలుడు. ( ఈ సొగసు గమనించే 'మల్లీశ్వరి' చిత్రంలోని నాయికా నాయకులు మేఘుల్ని దూతగా ఎన్నుకొని తమ వియోగ వ్యథను మరపురాని పాటలో వ్యక్తం చేసుకొన్నది. ) ఈ గుణాలున్న వ్యక్తులు దూతలుగా లభ్యపడిన వారి సంకల్పం తప్పక నెరవేరుతుంది. ఈ అగ్నిద్యోతనునకూ మేఘునికివలెనే

**కవుల పలుకులు**
*
**రసిక్**

జాలిగుండె, ఆశ్రిత వాత్సల్యము రెండూ పుష్కలంగావున్నాయి. కనుకనే తన కార్యసాఫల్యం కోసం రుక్మిణి అతన్ని దూతగా ఎంపిక చేసుకోవడం. కాగా, కాళిదాసు 'ఘనుణ్ణి' దూతగా ఎన్నుకొంటే, పోతన్న ఘనుడైన భూసురుణ్ణిదూతగా ఎన్నుకొన్నాడు. ఇదీ, 'ఘనుడు' శబ్దం లో దాగి వున్న సారస్యం.

చిత్రమేమిటంటే కొన్ని కొన్ని

( కొరవ 9 పేజి లో )

# గ్రంథ సమీక్ష

శ్రీ వెంకయ్యస్వామి మాతృదేవి పిచ్చమ్మ. పితృదేవుడు శ్రీ పెంచలయ్య నాయుడు. ఇంటిపేరు 'సొంపల్లి'. జన్మించిన గ్రామము రాపూరు తాలూకా నాగుల వెల్లటూరు. కమ్మవంశీయులు. సామాన్య కర్షక కుటుంబం.

శ్రీ వెంకయ్య స్వామి జీవితసంగ్రహమును విద్వాన్ శ్రీ కూరపాటి లింగరాజుగారు చంపూకావ్యముగ రచించిరి. ఈకావ్యరచనకు పూర్వమే వీరు పెనుశిల లక్ష్మీనృసింహ దేవునిపై 'కరుణాంబరి' శతకము ను రచించిరి. శ్రీ పెనం సుబ్బరామయ్య, ఆచార్య ఎక్కిరాల భరద్వాజ పండితుడు చెప్పిన అవధూత వెంకయ్య స్వామి లీలలను ఆధారముగా చేసికొని ఈ కావ్యమును రచించిరి.

కూరపాటివారి కావ్యము సరళము... మృదుమధురము. ఈకావ్యములో రెండవపద్యమునుండి 15 వ పద్యము వరకు మొదటి పాదము లోని మొదటి అక్షరములను చదివినచో "జయ! వెంకయ స్వామీ! నమో! గొలగమూడీశ" అనివచ్చును. ఇట్లు రచన చేయుట సామాన్యులకు సాధ్యముకాదు.

**శ్రీ భగవాన్ వెంకయ్య స్వాముల వారి జీవిత సంగ్రహము**
రచయిత
**కూరపాటి లింగరాజు**
సమీక్షకుడు
**వాకాటి పెంచలురెడ్డి**
ప్రమలకు
1198/1, అక్కసగారి వీధి
నెల్లూరు. 524003
వెల రూ 6/-

శ్రీ వెంకయ్య స్వామివారి మహిమలు చాలాగలవు. అగ్ని మనమేలును కోరునని ఋగ్వేదంలో కలదు. అందువలన అగ్నిగుండాలను

( కొరవ 9 పేజి లో )

# బాలాజినగర్‌లో కూరగాయల మార్కెట్ పెట్టాలి!

మద్రాసు బస్టాండులో కూరగాయల మార్కెట్ నిర్మాణం త్వరలో ప్రారంభం కానున్నది. రాష్ట్రంలోనే అత్యంతాధునిక మార్కెట్‌గా దీన్ని రూపొందించాలని జనార్దన రెడ్డి గారి ప్రయత్నం. కొత్తమార్కెట్ నిర్మాణం పూర్తయితే, టౌన్‌లోని మార్కెట్ సమస్యసగం తీరుతుంది.

ఇప్పుడున్న ఎసిమార్కెట్ ఎంత చండాలంగా, ఎంత ఇరుకుగా, ఎంత ఇబ్బందులమయంగా వుందో చెప్పనే అవసరంలేదు. అయితే దీన్ని మద్రాసు బస్టాండుకు మార్చినంతమాత్రాన టౌనంతటికీ ఉపయోగమనుకోవడం పొరపాటు. మద్రాసుబస్టాండు టౌన్ మధ్య భాగంలో వుంది. బాలాజీ నగర్, దర్గామిట్ట, వేదాయ పాళెం, అయ్యప్పగుడి, వంటి ప్రాంతాలలోని వారికి ఇది అందుబాటుకాదు. పదిరూపాయల కూరగాయలు కావాలంటే ఈ

**సింహపురి**

ప్రాంతాలవారు అంత మొత్తం రిక్షాబాడుగ కాని, అందులో సగం బస్ ఛార్జీకికాని ఖర్చు పెట్టాలి. మద్రాసు బస్టాండు స్థలం విశాలమైనదే అయినప్పటికీ, 4 లక్షల జనం అవసరాలు తీర్చేంత పెద్దది గాదు. కనీసం మరొక పాతికేళ్ల పాటు టౌన్‌కు ఇది ప్రధాన మార్కెట్‌గా వుంటుందని భావిస్తే, అప్పటికి నెల్లూరు జనాభా ఏ పదిలక్షలకో పెరుగుతుంది. ఈ రోజు ఎసిమార్కెట్‌తో పడుతున్న బాధలే, ఆరోజు ఈ మార్కెట్ లోనూ అనుభవించవలసివుంటుంది.

అందువల్ల మూడునాలుగు దశాబ్దాల అవసరాలు అంచనావేసి, దీని రూపకల్పన చేయడం అవసరం. దీనిని కేవలం హోల్ సేల్ మార్కెట్‌గా రూపొందించి, టౌన్‌లోని వివిధకూడళ్లలో రిటైల్ మార్కెట్‌లు నిర్మించడం ఒక ఆలోచించదగిన ప్రతిపాదన. పదికోట్ల పెట్టుబడిలో ఈ మార్కెట్‌కు 6 కోట్లు కేటాయించి, అదే సమయంలో ఒక్కొక్కటి కోటి రూపాయల ఖర్చుతో 4 మినీ మార్కెట్‌లు కడితే ప్రజలకు సౌకర్యంగా వుంటుంది.

ఒక్కబాలాజీ నగర్, దాని పరిసర నగర్‌లలో లక్షకు పైబడిన జనాభావుంది. వారిలో రోజుకు వెయ్యిమంది మార్కెట్‌కొచ్చినా, తలసరిపదురూపాయల లెక్కన రవాణా ఖర్చవుతుంది. వారికి ప్రత్యేక మార్కెట్ కట్టిస్తే, ఆ ప్రాంతం ప్రజలకు అంతమేరా డబ్బు, సమయం పొదుపు అవుతాయి.

( కొరవ 9 పేజి లో )



**ఉత్తర క్రియలు**

24.9.91తేది మంగళవారం ఉ॥గం 8.30 లకు నా కుమారుడు
**తిరుపతి కళాధర్‌బాబు**
ఇంజనీర్ – సాగర్ అసోసియేట్స్
స్వర్గస్థులైనారు.
తే 10.10.91 ది గురువారం ఉదయం 9 గం నెల్లూరు, రంగువారివీధి, 17/381, మా స్వగృహమునందు పెద్దకర్మ జరుగును.

జననం : 2 . 12. 1967
మరణం : 24 . 9. 1991

**తిరుపతి తిరిపాలయ్య**

# నెల్లూరు గుబ్బల్లి
## విహార్యకుడు

### జెకెకి స్వాగతం

రాష్ట్ర పబ్లిక్ అండర్ టేకింగ్స్ కమిటీ చైర్మన్‌గా నియమితులైన ఎమ్మెల్యే శ్రీ జెకెరెడ్డికి ఈ రోజు ( 4 తేది) ఉదయం నెల్లూరులో ఘనస్వాగతం లభించింది. రైల్వే స్టేషన్‌నుంచి ఇంటివరకు ఆయన అభిమానులు బొట్లు, పూలజల్లులతో ఆగం చేసేశారు. దినపత్రికలలో ఫుల్ పేజీ ప్రకటన లిచ్చారు. ఈ హడావుడి చూసినావం జెకెరెడ్డి ఆశ్చర్యపోయాడు!

అభిమానం అతిశయించి నందువలన జరిగిన పొరపాటు ఇది. పత్రికలలో జె కె రెడ్డి పబ్లిక్ అండర్ టేకింగ్స్ చైర్మన్‌గా నియమితులైనాడన్నవార్త అదేదో కార్పొరేషన్ అధ్యక్షత అన్న ధోరణిలో వచ్చింది. విలేఖరులకు ఈ పదవి గురించిన పరిజ్ఞానం లేదు. ఒక పత్రికలో అయితే ఆయన జీవిత సంగ్రహం కూడా ప్రకటించేశారు. వీటిని చూసి జెకె అభిమానులు కూడా ఆదృష్టిలోనే స్వాగతార్భాటం సృష్టించారు.

అయితే పబ్లిక్ అండర్ టేకింగ్స్ అనేది కార్పొరేషన్ కాదు. కమిటీ మాత్రమే. ప్రభుత్వ రంగ సంస్థల పనితీరుపై పరిశీలన జరపడంకోసం ఉద్దేశించిన శాసనసభాసంఘం. కమిటీ సభ్యులను, చైర్మన్‌ను కూడా స్పీకర్ నామినేట్ చేస్తారు. ముఖ్యమంత్రికి గాని, ప్రభుత్వానికి కాని ఈ నియామకంతో సంబంధమే లేదు. ఇదే మాదిరి ఎమినెటీస్, ప్రివిలేజెస్ వంటి కమిటీలు అసెంబ్లీలో వుంటాయి. వాటికి విడివిడిగా చైర్మన్లుంటారు.

ఈ వ్యత్యాసం తెలియక అభిమానులు చేసిన హడావుడి. అర్భాటం జెకెరెడ్డికే చాలా ఇబ్బందినే కల్గించినట్లున్నాయి.

### అభూతకల్పనలలో మామకుతగ్గఅల్లుడు

గిట్టనివారిపై అనత్యారోపణలబురద చల్లడంలో; అభూత కల్పనలలో , కట్టుకథలతో గోరంతను కొండంతచేసి గబ్బు పట్టించడంలోనూ మామ నల్లపరెడ్డి శ్రీనివాసులరెడ్డిని మించి పోతున్నాడు నాదిరెడ్డి చంద్రమోహనరెడ్డి.

కృష్ణపట్నంరేవు సమీపంలోని గుమ్మళ్ళదిబ్బగ్రామంలో ముఖ్యమంత్రి జనార్ధనరెడ్డి, వేమారెడ్డి రామచంద్రారెడ్డి లిద్దరూ కలిసి కోటి రూపాయల విలువైన 200 ఎకరాలభూమి ఆక్రమించుకున్నారని, పేద మత్స్యకారుల ఇళ్ళు పీకించివేశారని చంద్రమోహనరెడ్డి ఆరోపించాడు. దినపత్రికలలో దానికి పెద్ద ప్రచారం లభించింది. ఆధారమన్నదే లేని ఆరోపణ ఇది. గుమ్మళ్ళ దిబ్బ దగ్గర 27 హెక్టార్ల ప్రభుత్వ భూమి వున్న మాట వాస్తవం. రొయ్యలపెంపకం లీజుకు ప్రభుత్వం దాన్ని కేటాయించి, దరఖాస్తులు కోరింది. తెలుగు దేశం ప్రభుత్వహయాంలోనే ఈ భూములను రొయ్యల పెంపకం కోసం గుర్తించారు. ప్రకటన వెలువడిన తర్వాత దానికోసం 67మంది దరఖాస్తు చేసుకున్నారు. అందులో వేమారెడ్డి రామచంద్రారెడ్డి, జనార్ధనరెడ్డి మిత్రుడు సర్వారాయచౌదరి కూడావున్నారు. దరఖాస్తుల స్వీకారం తప్ప, ఇప్పటికి పరిశీలన కూడా పూర్తి కాలేదు. కేటాయింపుకు మరొక రెండేళ్లు పడుతుంది. అప్పటికి రాజెవరో ! మంత్రెవరో!

ఇదీ వాస్తవ పరిస్థితి. ఎకరాపదువేలుకూడా చేయని ఇసుక భూములవి. వాటికి కోటిరూపాయల విలువకట్టి జనార్ధనరెడ్డి ఆక్రమించేసుకున్నట్లు ఆయన చెప్పడం, దినపత్రికలలో బ్యానర్ హెడ్డింగులిచ్చి ప్రకటించేయడం జరిగిపోయింది.

యాంగ్లర్స్‌ప్యారడైజ్ ఇంకొక కథ. అబ్బయ్య నాయుడు అనే విలాస పురుషుడు 30,40 ఏళ్ళక్రితం కండ్లేరు అనుకొని వున్న ఇసుక దిబ్బమీద ఒక చిన్న ఇల్లు కట్టుకున్నాడు. పడవలు గిడవలు పెట్టి, చేపంగాలాలు సమకూర్చి దీనికొక విహారకేంద్రంగా గుర్తింపు తెచ్చాడు. అతడి మరణంతో అదిపాడుపడి పోయింది.ఆయన కుమారుడు దాన్ని సర్వారాయచౌదరికి అమ్మాడు. పేరులో తప్ప, అక్కడ ప్యారడైజ్‌ఏదీ లేదు. దానితో జనార్ధనరెడ్డికి సంబంధమూలేదు. దీనికి ఒక కథ అల్లి చెప్పాడు చంద్రమోహనరెడ్డి.

రాజకీయ ఆరోపణలకైనా ఒక పద్ధతి, పరిమితి వుండనవసరం లేదా ?

### పోలీసు దౌర్జన్యం - ఆర్టీసి మూకబలం!

ఆర్టీసి డ్రైవర్ల పోలీసుకానిస్టేబుళ్ళ మధ్యతెంరేగిన చిన్న వివాదం 3 తేది రాత్రి గ్రాండ్ ట్రంక్ రోడ్డుపై ఏడెనిమిది గంటలపాటు ట్రాఫిక్‌ను స్తంభింపజేసింది.

సాయంత్రం 4 గంటల సమయంలో కనుమూరు ఉరుసుస్పెషల్ బస్సులోకి అల్లూరు స్టేషన్‌కి చెందిన పి. రాజారామ్ అనే కానిస్టేబిల్ డ్రైవరు సీటుద్వారా ఎక్కబోయాడట. డ్రైవరు అతడ్ని నిరోధించాడు. ఇద్దరిమధ్య మాటామాటాపెరిగింది. ఆకానిస్టేబిల్ పోలీసు జులుం ప్రదర్శించిడ్రైవరును కొట్టాడట. ఇది చూసిన ఇతరడ్రైవర్లు అతడికి నాలుగు తగిలించారు. ఈవార్త కంట్రోలు రూముకి చేరింది. మొబైల్ పోలీస్లు ఆగమేఘాలమీద వచ్చి, ఏమిజరిగిందో విచారించకుండానే బస్టాండులో నిలబడి వున్నవారిని కూడా చితక బాదేశారు. ఈదౌర్జన్యం చూసి ఆర్టీసి సిబ్బంది తిరగబడ్డారు. ఉద్రిక్తత పెరిగిపోయింది. డ్రైవర్లు తమబస్‌లను తీసుకవెళ్ళి బస్టాండుఎదురుగా రోడ్లో నిలబెట్టేశారు. ఘర్షణకు కారకుడైన కానిస్టేబిల్‌ను ఒక గదిలో బంధించి చుట్టూ కాపలా నిలబడ్డారు. అతడ్ని సస్పెండ్ చేసి, లాఠీచార్జి జరిపినందుకు క్షమాపణ చెప్పాలని వారి డిమాండు: పోలీసులు అందుకు ఒప్పుకోలేదు. అర్ధరాత్రివరకు ఇదే ప్రతిష్టంభన. చివరకు ఆర్.టి.సి.రీజనల్‌మేనేజర్ శ్రీ శాస్త్రి, డివిజనల్ మేనేజర్ శ్రీ నాగరాజ తదితరులు తమ సిబ్బందిని ఒప్పించి సత్ఫుతెచ్చి,బస్‌లు కదిలించారు. పోలీసులుమాత్రం రాత్రి 8 గంటల నుంచే చర్చలనుంచి నిష్క్రమించి వెళ్లిపోయారు. ట్రాఫిక్ పునరుద్ధరణకు కూడారాలేదు.

ఈ సంఘటనలో పోలీసుదేనిస్సందేహంగా తొందరపాటు: చేతిలోలాఠీవుందని విచ్చలవిడిగా విసరడం వారికొక ఫ్యాషనైపోయింది. అడిగేవారు. అదుపులో పెట్టేవారులేరు. ఆర్టీసి డ్రైవర్లపై కోపాన్ని ప్రయాణికులపై చూపిన కానిస్టేబిళ్లను అధికారులు కూడా బలపరచారంటే ఇక వారికి అడ్డు ఎవరు? మూకబలం వుందికాబట్టి ఆర్టీసి సిబ్బంది ఈ మాత్రమైనా ప్రతిఘటించారు. మామూలు పౌరుడైతే ఏమిచేయగలడు ?

### రాజరాజేశ్వరి బ్రహ్మోత్సవాలు

దర్గామిట్ట శ్రీ రాజరాజేశ్వరి దేవస్థానం దసరా ఉత్సవాలను ఘనంగా జరిపించబోతున్నాడు. కెవి రామిరెడ్డి! నిప్పో జలంరెడ్డి, జెకెరెడ్డి, మాగుంట సోదరులవంటి పెద్దలందర్నీ వురికొల్పి. ఉత్సవాలు, కళాప్రదర్శనలు ఏర్పాటుచేశాడు. 8 నుంచి 17 తేదివరకు దర్గామిట్టలో చెప్పలేని సందడి. అమ్మవారి భక్తులు. కళాపిపాసులిద్దంకికావసినంత కాలక్షేపం. మనల్ని రమ్మంటున్నాడు ఈ ఉత్సవాంకి రామిరెడ్డి !అందరం పోతే, ఆదేవాలయంపట్టొద్దా?

### మరణం

గూడూరు. శ్రీ నెలబల్లి జనార్ధనరెడ్డి (55) 28 తేది రాత్రిమరణించాడు. ఆయనకు భార్య, ఇద్దరుకుమారులు వున్నారు. గూడూరు మైకా సంపన్నుడు శ్రీ ఎన్. ఎస్. రెడ్డి సోదరుడు జనార్ధనరెడ్డి.

### నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకు 9672 | | 3000 |
| మొలగొలుకు 9674 | | 3000 |
| ఐ ఆర్ 20 | | 2650 |
| ఐ ఆర్ 64 | | 2300 |
| మసూరు | | 2600 |
| బియ్యం | 75కి | 420 |
| బంగారు సవర (8గ్రా) | | 3300 |
| వెండి (10గ్రా) | | 72 |

### నీటిమట్టం

| | |
|---|---|
| కనిగిరి రిజర్వాయర్ | 18.80 అ. |
| నెల్లూరు చెరువు | 13.80 అ. |
| సర్వేపల్లి | 4.10 అ. |

## ఎమ్మెల్యేలు

(2వ పేజీ తరువాయి)

తోటిన వారిలో ప్రథముడు డాక్టర్ బి. సుందర రామిరెడ్డి. మూడు పర్యాయాల సీనియారిటీ క్లెక్ క్రింద తనకు ప్రమోషన్ కావాలని ఆయన పట్టుబట్టాడు. అయితే సుందరరామిరెడ్డి గారికి సీనియారిటీ తప్ప, ముఖ్యమంత్రి వల్ల సిన్సియారిటీ లేదన్నది మాత్రం వాస్తవం. 78 -82 సమర్థ నిత్యంతరం లేమువాని. 1984 ఎన్నికలలొద్యాత ఆయన జనార్ధనరెడ్డికి వ్యతిరేకంగా అనం వంజీవరెడ్డి క్యాంప్‌లో వుండేవాడు. చెన్నారెడ్డి ముఖ్యమంత్రిత్వంలోనూ సుందర రామిరెడ్డిగారు "జనప్రియ" కు రావడాన్ని అప్రియంగా భావించేవారు. పిఎల్‌పి ఎన్నికల్లో వేతులు వట్టుకొని ప్రతిమలాడాల్సివచ్చింది. ఈ "అర్హత" ం బలమే కాబోలు ఆయనకు అందరి కంటే ముందుగా, అందరికంటే పెద్దదైన ఎస్ ఎస్ పి అధ్యక్షపదవిని వంపాదించి పెట్టింది.

పెళ్లా ప్రకాశరావు నోట్లో వాయికలేని, ప్రక్కచూపులు తెలియని జనార్ధనరెడ్డి విధేయుడు. పదవిలో లేకపోయినా తన పోషణే తనకు బాధ్యమైన అమాయకుడు. ఆర్‌టిసి రీజనల్ బోర్డు చైర్మన్ గిరిత్వంతో ఆయన లాయల్టీకి సత్కారం చేశాడు ముఖ్యమంత్రి.

వి.వి. శేషారెడ్డి సంగతి ప్రత్యేకంగా చెప్పాలా! జనార్ధన రెడ్డి పదవిలో వున్నా, లేకపోయినా; పిల్లి ప్రక్కన పెట్టుకున్నా, కనురుకుని పొమ్మన్నా జనార్ధనరెడ్డిని వదలని వీరాభిమాని. అటోలో, తిరగాల్సివస్తున్నదని ఒకవంక అసంతృప్తి ప్రకటిస్తూనే, నాకే పదవి వద్దని చెప్పుండే వాడు. అయినా ఈ ఏడాది కాలంలో తన తరపున ఎమ్మెల్యేలతో రాయబారం జరిపి, అలిగిన వారికి జోంపాటలు పాడి, అయిష్టంగా వున్న వారికి ఆశలు చూపి దగ్గరజేసినందుకు ప్రతిఫలంగా 'విప్' పదవి బహుకరించాడు. శేషారెడ్డిగారి పనితీరుకి తగిన పదవి ఇది. ఎమ్మెల్యే హాస్టల్లో ఎక్కేగడప, దిగే గడపగా కాలికి బలపం కట్టుకొని వాలుకకు చేతి పూసుకొని ఎమ్మెల్యేలను బుజ్జగించడమే పనిగా మెంగేవాడు శేషారెడ్డి. 'విప్' పదవితో ఆయనా లాలిపాటలు అధికారయుతంగా నెపాడవచ్చు. శేషారెడ్డి మొదట ఈ పదవి తనకు వద్దన్నాడట. కాని, తనవంతు స్నేహధర్మంగా నెమ్మి పదవీపంజరంలో బంధింతక తప్పదని ముఖ్యమంత్రి వట్టువట్టడంతో కాదనలేకపోయాడు. శాసన సభలో ఇప్పుడు ఒక చీఫ్‌విప్, ఇద్దరు పాదా విప్‌లున్నారు. శేషారెడ్డిది కొత్తగా సృష్టించిన అదనపు పదవి. కోస్తా జిల్లాల ఎమ్మెల్యేలను ఆయనకు కేటాయించారు. కారు, బంగళా, పిఎ ం వంటి సౌకర్యాలన్నీ లభించే స్టేట్ మంత్రిత్వహోదాలో ఆయనీ పదవి నిర్వహిస్తారు.

నెల్లూరు ఎమ్మెల్యే శ్రీ జకెరెడ్డి, పబ్లిక్ అండర్ టేకింగ్స్ కమిటి ఛేర్మన్‌గా ఎన్నికైనారు. ఇది శాసనసభాపదవి. ప్రభుత్వానికి సంబంధం లేదు. స్పీకర్ నామినేట్ చేస్తేనే లభిస్తుంది. కారు, క్యాబినెట్ హోదా వుండదనేగాని, శాసన సభ్యుడుగా చిత్తశుద్ధితో ప్రజలకు సేవచేయడానికి విలువైన అవకాశం లభిస్తుంది. విద్యుత్ సంస్థ, ఆర్‌టిసి వంటి ప్రభుత్వరంగ సంస్థల పనితీరును పరిశీలించి, శాసన సభకు నివేదించడం ఈ పదవి కర్తవ్యం. ఆటెండరు, పిఎల వంటి హంగులు మాత్రం వుంటాయి.

జకెరెడ్డి కి గెలువూ స్వతంత్రంగానే సిద్ధించింది; ఈ పదవీ స్వంత్రం గానే లభించింది. ప్రభుత్వంతో నిమిత్తం లేకపోయినా ఆయన్నూ ఇక నిరుద్యోగుల జాబితా నుంచి తొలగించవచ్చు.

జనార్ధనరెడ్డిని తన ఆరవ ప్రాణంగా భావించే శ్రీ పసల పెంచలయ్య ఇంకా పదవులకు దూరంగా వుండవలసిరావడం చింతించాల్సిన విషయమే. సీనియారిటీ విధేయత, నమర్థత వంటి అర్హతలన్నీ ఆయనకున్నాయి. పదవిలో వున్నా, లేకున్నా పోరాడే గుణంవుంది. అవే ఆయనకు అనర్హతలైనా యేమో, పాపం!

వెంకటరత్నం నాయుడి గారికి, చెన్నారెడ్డి దిగిపోతూపోతూ ఆర్డర్ వేసిపోయిన సివిల్ సప్లయిస్ ఛేర్మన్ గిరిత్వం ఇంకా చేతికి అందలేదు. మంత్రిత్వానికి మోజు పడి దాని జోలికి పోకుండా వుండినా డింతకాలం. ఇప్పుడా ఆశలేదు కాబట్టి, అదే పదివేలని కళ్లద్దుకోబోతాడేమో చూడాలి!

నిరుద్యోగ సమస్యతో అధికార ఆకలి మంటలో అలమటించి పోతున్న వారిలో కావలి యానాది రెడ్డిగారు ప్రథములు.

ఆరోగ్య కారణాల దృష్ట్యా వయసు దృష్ట్యా తనకిప్పటికిప్పుడు అవకాశం ఇచ్చితీరాలని ఆయన మంకుపట్టుదల. సిన్సియారిటీకి నిర్వచనం తెలియక పోయినా, సీనియారిటీ మాత్రం వుంది. కావలిలో ప్రజాభిమానానికి కొదవలేదు. రాజకీయ జీవితంలో అవినీతికి ఆస్కారం ఇవ్వనివాడు యానాదిరెడ్డి. అహంకారి అనో . వంటికి మానెపూసుకొంటాడనో, అధికారులను చెవ్వుకు తింటాడనో, అతివినయం ప్రదర్శించి అనక మాడుమీద తంతాడనో యానాదిరెడ్డిని విమర్శించవచ్చునేమో. పదవివద్దంపెట్టుకొని పైపాతాకాడని ఎవరూ చెప్పలేరు. పదవీకాంతకు ఒక చెడ్డ గుణం వుంది. - తాపత్రయపడే కొద్దీ దూరదూరంగా జరిగి పోవడం, వెట్టువేస్తే వచ్చి వళ్లో వాలడం దాని తత్వం.

ఎమ్మెల్యేతర అనుచర వర్గంలో కూడా నిరుద్యోగ బాధితులు చాలా మంది వున్నారు. గ్రంథాలయ సంస్థ, స్పిన్నింగ్ మిల్లు వంటి పదవులూ చాలా ఖాళీ వున్నాయి. జనార్ధన రెడ్డిగారు ఇవ్వదలచిన వారికి, ఇవ్వవలసిన వారికి వెంటవెంటనే పదవులిచ్చేస్తే చాలా తలనొప్పులు తగ్గుతాయి.

## తాటిచెట్టు వ్యాసం–ఒకసవరణ

27-9-91 సంచిక 4 పేజీలో "కల్పతరువు- తాటిచెట్టు" అన్న వ్యాసంలో ఒక వాక్యం తప్పుగా అచ్చయింది.

మొదటికాలం రెండవ పేరాలో "..ఏడేళ్ళ పసిపాపకు కూడా సంతానం కల్గించే విధంగా, ఆరునెలలకు కూడా నెలలకే సంతానిచ్చే నిష్పక్షజాతి ఫలజాతిని రూపొందించడంలో..." అని అచ్చయింది.

"పదేళ్ళ పసిపాపకు సంతానం కల్గించే విధంగా, ఆరు నెలలు, మూడు నెలలకు కూడా ఫలితాన్నిచ్చే వృక్ష, ఫలజాతులను రూపొందించడంలో ఆహో రాత్రులు పరిశోధనలు సాగిస్తున్న వ్యవసాయ శాస్త్రజ్ఞులు" అని వుండాలి.

మరో చిన్న పొరపాటు మూడవ కాలంలో '..... దబ్బలు చెక్కగా వచ్చే దూల అని అచ్చయింది. - అది 'దూల' కాదు 'బూల' ముఖ్యమైన ఈ రెండు సవరణలను పాఠకులు గమనించ గోరుతాము.

సంపాదకుడు.

## జనవాణి

(3పేజీకొరవ)

మించిన, కోటానుకోట్ల రూపాయల విలువగల ఆస్థి పాస్తులను కనుగొన్నారని పత్రికలలో వార్తను ప్రచురించారు. ఆయనకు తిరువనంతపురంలోని "పోష్ లొకాలిటీ" జవహర్ నగర్ లో రెండు ఇండ్లు, కొట్టరకర లో కుటుంబం బంగళా, కొచ్చిన్, బొంబాయి, మద్రాసు ల్లో ఫ్లాట్లు (Flats) తమిళనాడులో కులశేఖరం అనేచోట పెద్ద ఎస్టేట్,
అందులో ఒక బంగళా వగైరా ఉన్నాయట.

మరి ఈ మధ్యమనం గ్రానైట్స్, ఎం.ఎల్. ఏలకు జాదిలీ హిల్స్‌లో ఇండ్లస్థలాల కేటాయింపు, హవాయి, చి వెంట ల వ్యాపార ల శ ల పన్నురాయితీలు, ఇంకాఎన్నో, ఎన్నో పత్రికల్లో చదివి దిగ్భ్రాంతులౌతున్నాం.

మనదేశంలో, (మనరాష్ట్రంలో సహా) లంచగొండితనం, అరాచకం, మతకలహాలు; బాలికలు, స్త్రీలు బలహీన వర్గాలమీద ఎడతెరిపి లేని దాడులు, హత్యలు, మానభంగాలు, దారిదోపిడీలు, కంట్రాక్టర్లు, ఇంజనీర్ల రాజకీయదళార్ల అంతులేని దోపిడీ; నిర్మాణం లోనున్నబ్రిడ్జీలు, వాటర్ టాంకులు, బిల్డింగులు కూలిపోవడం, జనం వాటిక్రింద పడిచావడం ప్రతిరోజూ వింటున్నాం.

డాక్టర్ మన్ మోహన్ సింగ్ పుణ్యమా అని, అదుపులేని అధిక ధరల భారంతో నలమల మౌతున్న సామాన్యపౌరులు, ప్రముఖ స్థానాల్లో వున్న పలుకుబడి గలవారి కోటానుకోట్ల అక్రమార్జనం వార్తలు చదివి మన దేశ భవిష్యత్తు ఏమిటా ? మనం బాగుపడగలమా అని నిస్పృహ చెందుతున్నారు. ఈ స్థితి ఎక్కడికి దారితీస్తుందో ? కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు నిస్సహాయ స్థితిలో ఉన్నాయి. పాలక వర్గంవారు గద్దె ఎక్కించడం, క్రిందికి లాగి పడవేయడంలో నిమగ్నులయి వున్నారు. పదవుల రక్షణలో మంత్రివర్గాలకు పై సమస్యలు అదుపు ఆజ్ఞల్లో పెట్టే అవకాశమే లేదు.

మరి సామాన్య పౌరులం మనం ఏమిచేయగలం ? ఏమిచేయవలె? ఎవరికివారు ఆలోచించి మనదేశం బాగుపడేమార్గం అన్వేషించండి.

నెల్లూరు — వి.అనంత రామయ్య
అధ్యక్షులు నెల్లూరు జిల్లా శాంతి సంఘం

### జమీన్ రైతు చందా

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ 75-00 |
| ఆరునెలలకు | రూ 40 -00 |
| విడి ప్రతి | రూ 1-50 |

# కోడిరామకృష్ణ కూడానటుడైనాడు!

డైరెక్టర్లు, నిర్మాతలు, ఇతర సాంకేతిక నిపుణులందరూ తెరముందుకు వస్తున్న రోజులివి. కోడిరామకృష్ణ ఇదివరకు చిన్న పాత్రలు ధరించినా ఆర్.ఎస్. క్రియేషన్స్‌వారి "మారీడు" చిత్రంలో రాధిక సరసన నటించబోతున్నారు. దివ్యవాణి పురుష ద్వేషిగా నటిస్తోంది. రఘు, బ్రహ్మానందం, సంజీవి, ఏ.ఎల్. నారాయణ, హరిబాబు, జాకీర్ బాబు, రూపిని, రాధాకుమారి ఇతర పాత్రధారులు. కథ,స్క్రీన్ ప్లే, దర్శకత్వం: కె.ఆదిత్య.

### అక్టోబర్ 2న "ఆగ్రహం"

మల్లెమాల సుందరరామరెడ్డి సమర్పణలో ఆయన తనయుడు శ్యాంప్రసాద్‌రెడ్డి నిర్మించిన ఎం.ఎస్. ఆర్ట్ మూవీస్ "ఆగ్రహం" సెప్టెంబర్ 25 న విడుదల కావలసింది.కొన్ని సాంకేతిక కారణాలమూలంగా అక్టోబర్ 2కు విడుదల వాయిదాపడింది. రాజశేఖర్, అమలలతో పాటు ఏ.కృష్ణారెడ్డి, మాలకొండారెడ్డి, కె.వి. భాస్కరరావు, మందడి కృష్ణారెడ్డి, రవీంద్రరెడ్డి, శరత్ ఆదిగాగలవారు పాల్గొన్నారు. మాటలు: [illegible] సోదరులు. గీతాలు: మల్లెమాల సిరివెన్నెల సీతారామశాస్త్రి. సాహితి సంగీతం: రాజ్-కోటి. దర్శకత్వం: ఎ.ఎస్.రవి. ఈ సంస్థ ఇదివరకటి హిట్ చిత్రాలు "తలంబ్రాలు, ఆహుతి, అంకుశం", లను మించికలెక్షన్లలో సంచలనం సృష్టిస్తుందని చిత్రపరిశ్రమలో ఎక్కడిలా వినిపిస్తోంది.

### "అమ్మరాజీనామా"

దాసరిమార్కు టైటిల్ ! ఆయనే స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు, దర్శకత్వంకూడా. శారద, సత్యనారాయణ, శుభలేఖ సుధాకర్, ప్రసాద్‌బాబు వగైరా నటవర్గం. ఏడు వందల సార్లకు పైగా ప్రదర్శింపబడిన "ఆయూరిటైర్ హోతే" అనే మరాఠీ నాటకం మాతృక.

### "రేపటి కొడుకు"

"తండ్రెవరో తెలియని కొడుకు గురించి కథ," అన్నారు నెల్లూరీయుడు ముత్యాల సుబ్బయ్య. ఈయన దర్శకత్వంలో

## సినిమా

డి.డి.ప్రసాద్ బాబు నిర్మిస్తున్న ఫై చిత్రంలో జయసుధ, చంద్రమోహన్, సుధాకర్,వేలు, రావికొండలరావు, శుభలేఖ సుధాకర్, బాబూమోహన్, చిట్టిబాబు, అన్నపూర్ణ, పూజిత నటిస్తారు.

### నమ్మలేని నిజం

దాసరి దర్శకత్వంలో విజయలక్ష్మి ఆర్ట్ మూవీస్ నిర్మించిన "నియంత" చిత్రంలో అసలు డాక్టర్ రాజశేఖర్ హీరోగా నటించవలసింది. కాని, జీవితకు ఆ కథ నచ్చనందున దాసరికి రాజశేఖర్‌కి మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమనేంత పరిస్థితి ఏర్పడింది. ఇది విచిత్ర పరిశ్రమ. ఇప్పుడదేసంస్థ దాసరి దర్శకత్వంలో నిర్మించబోయే చిత్రంలో రాజశేఖర్ ఒకటి కాదు; రెండు పాత్రలు ధరించబోతున్నాడు.

### "బెజవాడ బందిపోట్లు"

ఒక డాక్టరు, ఒక చార్టర్డ్ అకౌంటెంటు, ఇద్దరు పెద్దమనుషుల పాత్రలలో నవభారత్ బాబూరావు సమర్పణలో ఆయన తనయుడు జి.బాలాజీ నిర్మించే "బెజవాడ బందిపోట్లు" చిత్రానికి స్క్రిప్టు తయారవుతోంది. ★

# భారీచిత్రాలంటే భయమేస్తున్నది!

ఎన్నోకోట్ల వ్యయంతో బ్రహ్మాండం బద్దలయ్యేలా [illegible]గారు తీయబడిందని విపరీతంగా [illegible]చం సాగించిన "శాంతి క్రాంతి" [illegible]చం తుస్సుమనడంతో ఇతర భారీ [illegible] గుండెలు గుభేలుమన్నాయి. ఇటుపైన భారీ చిత్రాలు తీయడం కన్నా తక్కువ బడ్జెట్ లోనే చిత్రాలు తీయాలన్న నిర్ణయానికి వచ్చారు కొందరు

### కోదండరామిరెడ్డి చిత్రావళి

బాలకృష్ణ,విజయశాంతి నటించే యువరత్న ఆర్ట్స్ "నిప్పురవ్వ" భారీ చిత్రం ప్రారంభమైంది. డాక్టర్ రాజశేఖర్‌తో బుర్లిసుబ్బారావు నిర్మించే చిత్రం, చిరంజీవిత శివప్రసాద్ రెడ్డి - శేఖర్‌బాబు నిర్మించే చిత్రం, [illegible]తో శ్రీ మూవీస్ నరసింహారావుచిత్రం. నాగార్జునతో వి.దొరస్వామిరాజు చిత్రాలను నెల్లూరీయుడు ఎ.కోదండరామిరెడ్డి ఇంతవరకు అంగీకరించారు. కొంత కాలం వరకు కోదండ రామిరెడ్డి కొత్త చిత్రాలను అంగీకరించరట. అందుకు కారణాలేమిటో సమయమొచ్చినప్పుడు చెప్తారట !

### వీడియోకు అదనంగా పారితోషికం కోరినతార

మద్రాసులో ఒకలాటరీ టిక్కెట్ల

( కొరవ7 పేజి లో)

## సమాజక్షాళనకు క్రాంతిమార్గమే శరణ్యమని ప్రబోధిస్తున్న

# శాంతి - క్రాంతి

**చిత్రసమీక్ష**
**గిద్దలూరుగోపాలరావు**

పసి పిల్లల పట్ల ప్రేమ, వాత్సల్యం, కరుణ, త్యాగం కనుపరచవలసిన మనిషి సంకుచిత స్వభావంతో పసివారిని తన స్వార్థానికి వుపయోగించుకోవటమన్నది నిజంగా మరచిపోలేని బాధను మిగిల్చే కథ అవుతుంది. మెండుగా మానవత్వం పరిమళించవలసిన మానవ సమాజంలో అలాంటి మనిషి ఒక రాక్షసిక్రిందే లెక్క. మానవత్వం లోపించిన అలాంటి మనిషి, గుండె స్థానంలో బండ నిండుకున్న ఆ మనిషి వికృతరూపం "శాంతి - క్రాంతి" చిత్రంలో దర్శనమిస్తుంది.

"డాడీ" - అనిపిలిపించుకునే ఒక పెద్దమనిషి( అనంతనాగ్) పసిపిల్లలకోసం "ఓం" - అనే పేరున ఒక అనాధాశ్రమం నడుపుతుంటాడు. ఆ అనాధాశ్రమంలో సదరు "డాడీ" అనబడే పెద్దమనిషి నిరంకుశత్వం వికటాట్టహాసం చేస్తుంటుంది. అందులోని పిల్లలచేత నానాచాకిరీ చేయిస్తుంటాడతడు. అనాధాశ్రమాన్ని ఆసరాచేసుకొని మత్తు మందుల స్మగ్లింగ్, మనిషి అవయవాల అక్రమవ్యాపారం సాగిస్తుంటాడు. ఈ [illegible] బైటపడాలనుకుంటారు కొందరుపిల్లలు. ఆ ప్రయత్నంలో వాళ్ళు ఆశ్రమానికి సంబంధించిన బస్సు ఉపయోగిస్తారు. వచ్చీరాని డ్రైవింగుతో ఆ బస్సును ఒక ఎలక్ట్రిక్ ట్రాన్స్ ఫార్మర్‌కు గుద్దుతారు. మంటలు రేగి బూడిదవుతారు. ఇది, అనాధాశ్రమంవారు చేసిన "హత్య" అంటాడు. పోలీస్ ఇన్ స్పెక్టర్ సుభాష్ (నాగార్జున) కాదు అంటారు అనాధాశ్రమం పెద్దలు. అనాధాశ్రమంలో పనిచేస్తున్న టీచర్ (జూహిచావ్లా) అక్కడి రహస్యాలు సుభాష్‌కు తెరవేస్తూవుందన్ననేరంతో "డాడీ" ఆమెను అమానుషంగా హత్యచేయిస్తాడు.

ఇలాంటి అక్రమాలు, దురాగతాలు సమాజంలో ఎన్నోజరుగుతున్నాయి. "డాడీ" లాంటి మేకవన్నె పులులు ఎందరో వున్నారు. ఈ దురాగతాలను, ఈ పులులను అంతమొందించను, శాంతి పథాన్ని అనుసరించాలంటాడు ఒకపోలీస్ ఆఫీసర్ భరత్ ( వి. రవిచంద్రన్ ). క్రాంతి పథాన్నేచేపట్టాలంటాడు మరోపోలీస్ ఆఫీసర్ సుభాష్ ( నాగార్జున). ఇందులో సుభాష్‌తానుచేపట్టిన పంథాలో విజయం సాధిస్తాడు. ఆశ్రమంలోనివాళ్లలను సైన్యంగా వాడుకొని డాడీని హతమారుస్తాడు.

( కొరవ7 పేజి లో)



గూడూరు సబార్డినేట్ జడ్జికోర్టులో
**E. P 16/90**
**Nellore O.S 116/76**
స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా, వెంకటగిరి
**Represented by it's Branch Manager .... D.H.R**
**Vs**
లాలాపేట క్రిష్ణయ్య ............ **J.D**

ప్రకటన

ఈ క్రింద నమోదైన షెడ్యూలు దాఖలా స్థిరాస్తిని పైకోర్టు లో 4-11 - 1991 తేది ఉదయము 10.30 గంటకు బహిరంగము గా వేలము జరుపబడును. వేలము పాటపాడ దలచిన వారు పాడుకొన వచ్చునని యిందు మూలముగా యావన్మందికీ తెలియ జేయడమైనది.

ఆస్తిషెడ్యూలు

నెల్లూరు డి ‌। వెంకటగిరి మండలం బొమ్మగుంట గ్రామములో వున్న జె.డి. కి హక్కుగల మాగాణి పొలము వివరము

| పట్టానెం | సర్వేనెంబరు | విస్తీర్ణము యె.సెంట్లు | హెక్టార్లు | డి. హె విలువ | అమినా విలువ |
|---|---|---|---|---|---|
| 5 | 17/4 | 0.11 | 0.046 | రూ 550/ | రూ440/- |
| 41 | 17/7 | 0.75 | 0.303 | రూ 3750 | రూ3000/- |
| 66 | 17/5 | 0.18 | 0.073 | రూ 900 | రూ720/- |
| | 17/6 | 0.22 | 0.089 | రూ 1100 | రూ 880/- |
| | 18/6 | 0.05 | 0.020 | రూ 250 | రూ 200/- |
| | 18/7 | 0.13 | 0.052 | రూ 650 | రూ 520/- |
| | 18/8 | 0.21 | 0.085 | రూ 1050 | రూ 840/- |
| | 18/9 | 0.12 | 0.049 | రూ 600 | రూ 480/- |
| | 18/10 | 0.19 | 0.077 | రూ 900 | రూ 760/- |
| | 17/8 | 0.51 | 0.206 | రూ 2500 | రూ2040/- |

నెల్లూరు జిల్లా - వెంకటగిరి మండలం - పెట్లూరు గ్రామములో JDకి హక్కుగల మాగాణి, పొలము వివరము

| పట్టానెం | సర్వేనెంబరు | విస్తీర్ణము యసెంట్లు | హెక్టార్లు | డి. హె విలువ | అమినా విలువ |
|---|---|---|---|---|---|
| 28 | 39/4 | 0.03 | 0.012 | రూ 360/ | రూ150/- |
| | 39/2 | 0.09 | 0.036 | రూ 270/- | రూ450/- |
| | 72/5 | 0.32 | 0.129 | రూ 960/- | రూ1600/- |
| | 72/9 | 0.34 | 0.137 | రూ 1030/- | రూ 1700/- |
| | 73/11 | 0.17 | 0.669 | రూ 510/- | రూ 850/- |
| | 73/13 | 0.30 | 0.121 | రూ 900/- | రూ 1500/- |
| | 57/6 | 0.52 | 0.210 | రూ 1560/- | రూ2500/- |
| | 47/1 | 0.12 | 0.049 | రూ 360/- | రూ 600/- |
| | 34/4 | 0.73 | 0.295 | రూ 2190/- | రూ3650/- |

B కామదాసు
DH.R. అడ్వకేటు

ఇటీవల టౌన్‌హాలులో జరిగిన అక్కినేని నాగేశ్వర రావు జన్మదిన వేడుకలలో రికార్డు డ్యాన్సులలో ప్రథమ బహుమతి పొందిన నెల్లూరుజేసీస్ సెక్రటరి పి. శ్రీనివాసరావు నుండి అవార్డు స్వీకరిస్తున్నకోట్ల అమీనా బి.వెంకయ్య

## బహిరంగవేలము

కాలపరిమితి గడిచినప్పటికి విడిపించని పద్దులు

పుక్ రాజ్ రామ్ లాల్ జైన్ పాన్ బ్రోకర్స్ పి.బి.యల్ నెం 88/78. 2-101-1 పోస్టాఫీసు వీధి, రేణిగుంట వారితాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 1-5-90 నుండి 31-8-90 తేది వరకు గల విడిపించని పద్దులు 12-10-91 తేది ఉదయం గం|| 10 ం నుండి 2-101-1 పోస్టాఫీసు వీధి రేణిగుంటలో బహిరంగముగా వేలము జరుపబడును.

2). శాంతి అండ్ కో పాన్ బ్రోకర్స్ పి.బి.యల్ నెం 7500. 15 బజారువీధి తిరుపతి వారితాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 1-11-89 నుండి 30-5-90 తేది వరకు గల విడిపించని పద్దులు 14-10-91 తేది ఉదయం గం|| 10 ం నుండి 15 బజారు వీధి, తిరుపతి లో బహిరంగము గా వేలము జరుపబడును.

3). సురేష్ పాన్ బ్రోకర్స్ పి.బి.యల్ నెంబరు 230 20-2-674ఎ కొర్లగుంట తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 2-10-89 నుండి 28-6-90 తేది వరకు గల విడిపించని పద్దులు15.10.91 తేది ఉదయం గం|| 10ం నుండి 20.2.674. కొర్లగుంట తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

4). [illegible]రాస్ ఫైనాన్స్ పాన్ బ్రోకర్స్ 2/41మదరాసు రోడ్డు. రాజంపేట వారితాలూకుకాలపరిమితి గడిచినప్పటికి 26-1-88 నుండి 8-1-90 తేది వరకు గల విడిపించని పద్దులు 16-10-91 తేది ఉదయం గం|| 10 ం నుండి 2/41 మదరాసు రోడ్డు, రాజంపేటలో బహిరంగముగా వేలము జరుపబడును.

5). బాలకృష్ణ పాన్ బ్రోకర్స్ పి.బి.యల్ నెం 62, 2 సరోజినీదేవి రోడ్డు, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 25-5-90 నుండి 15-9-90 తేది వరకుగలత విడిపించని పద్దులు 17-10-91 తేది ఉదయంగం|| 10 ం నుండి 2 సరోజినీదేవి రోడ్డు, తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

6). యం. గోవిందలాల్ శర్మ పాన్ బ్రోకర్స్ పి.బియల్ నెం 218, 20.2.708 కొర్లగుంట తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 11-5-90 నుండి 1-9-90 తేది వరకు గల విడిపించని పద్దులు 19-10-91 తేది ఉదయం గం|| 10 ం నుండి 20-2-708 కొర్లగుంట తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

7). శ్రీ లక్ష్మిపాన్ బ్రోకర్స్ పి బి యల్ నెం 7. 10/559 సంతపేట నెల్లూరు వారి తాలూకు కాలపరిమితిగడిచినప్పటికి 7-10-89 నుండి 23-4-90 తేది వరకు గల విడిపించని పద్దులు 20-10-91 తేది ఉదయం గం|| 10ం నుండి 10/559 సంతపేట నెల్లూరు లో బహిరంగముగా వేలము జరుపబడును.

8). మెస్సర్స్ కామయ్య అండ్ కో పాన్ బ్రోకర్స్ పిబియల్ నెం 60, 8/71 బజారువీధి, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 2-1-90 నుండి 3-8-90 తేది వరకు గల విడిపించని పద్దులు 21-10-91 తేది ఉదయం గం 10 ం నుండి 8/71 బజారువీధి, తిరుపతి లో బహిరంగముగా వేలము జరుపబడును.

9). యం. సాగర్‌మల్ జైన్ పాన్ బ్రోకర్స్ పి.బియల్ నెం 50, 8/188 బజారువీధి తిరుపతి వారితాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 4-1-90 నుండి 29-6-90 తేది వరకు గల విడిపించని పద్దులు 22-10-91 తేది ఉదయం గం 10 ం నుండి 8/188 బజారువీధి తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

10). జె. నర్సింగ్‌లల్ శర్మ పాన్ బ్రోకర్స్ పి.బియల్ నెం 145, 201 చిన్నబజారు, తిరుపతి వారితాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 27-4-89 నుండి 3-8-90 తేది వరకు గల పద్దులు 21-10-91 తేది మధ్యాహ్నం గం 12 ం నుండి 201 చిన్న బజారుతిరుపతి లో బహిరంగముగా వేలము జరుపబడును.

11). మూలా శోభాగోమల్ అండ్ సన్స్‌పాన్ బ్రోకర్స్ పి.బియల్ నెం 6, మెయిన్ రోడ్డు - పాకాల వారితాలూకు కాలపరిమితి గడిచినప్పటిక 1-2-90 నుండి 31-5-90 వరకు గల విడిపించని పద్దులు 2-11-91 తేది ఉదయం గం|| 10 ం నుండి మెయిన్ రోడ్డు పాకాల లో పై అడ్రసు వారి అంగడి లో బహిరంగముగా వేలము జరుపబడును.

12). జి.పోకర్ రామ్ పటేల్ పాన్ బ్రోకర్స్ పి.బియల్ నెం 173, 13/1/22ఎ, పెద్దకాపు వీధి తిరుపతి వారితాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 3-7-90 నుండి 28-5-90 వరకు గల విడిపించని పద్దులు 23-10-91 తేది ఉదయం గం|| 10ంకు 13/1/22ఎ పెద్దకాపు వీధి, తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

కె.వి.రామకృష్ణారావు
ప్రభుత్వం నియమించిన వేలం దారు
11/268, సంతపేట, నెల్లూరు

# శివారెడ్డి పద్యాలు

### వ్యతిరేక పక్షాలు

అతికిబోయ్యి కొన్ని వ్యతిరేక పక్షాలు
రచ్చజేస్తు వుంటె రాత్రిపగలు
శాసన సభలో, చేసి పాడించెదేముంది
భయము భక్తి లేని పాట్లుగాక!

అప్రతిష్టలేదు అవమానమూలేదు
హద్దుపద్దులేదు ఆదినుండి
క్రొత్తగారు తనకు కొట్లాట పోట్లాట
పుట్టుజాడ్యం యింకపోనెపోదు.

ముఖ్యమంత్రిగారు! మోమాటపడబోకు
అవసరమ్ము బెత్తం హద్దు పద్దు
లేదు, భయము, భక్తి లేమారిపోతుంది
అంతరించిపోర్ది, ఆంధ్రప్రగతి!

### కోడి

జాము జామున నీకీర్తి నాటుకోడి
వెంట దిబ్బన దిరుగాడు పేదకోడి
మాయమర్మంబు లెరుగని మంచికోడి
గొంతుకోస్తేవునువ్వుపచ్చి గూండవీవు.

### రొయ్యలు

రొయ్యలంటె కవికి రోయింపు లేనేం
ఎన్నిదిన్న కవిని ఏమిజెయదు
రోజుకొక్కకేజి రొయ్యల్నిబంపించు
వాడుకొక్కటీర్చు మంత్రివర్యా.

### పద్యాలు

పదులు, నూర్లు,వేలు పద్యాలువ్రాశాను
వేస్టుకాగితాలు, వేస్టుపైము
సినిమాలో కవిని చిన్నగేయం వ్రాస్తె
కార్లు ఇంటిముట్టు, కనకవర్షం.

చిన్నగాడు తాను లక్షాధికారౌను,
పనికిమాలినోడు ప్రభువగును
అన్నిటికిని యొగుని ఆధారభూతుండు
దేవదేవుడు, ప్రతిది తెలుసునీకు!

### కత్తి

బియ్యం కత్తి, నూనె నెయ్యిచక్కెర కత్తి
పాలిటిక్సుకత్తి ప్రతిదికత్తి
కత్తి లేనిదేది కనిపించడంలేదు
కలి మహత్తు తెలియగాదు మనకు

ఆర్థికంగా దేశం అభ్యున్నతికి రాదు
పైకిపోదు కత్తిలేకపోతె
అవసరమ్ము కత్తి అదినేనుకాదన్ను
ఎక్కువైతె చెడ్డ ఏది కూడ.

### ఆర్.టి.సి బస్సు

ఆర్.టి.సి. బస్సు ఆరాటమేమందు
అడుగుబెడితె రెండు, ఆశమొండు
ఆడిగెదిక్కులేదు ఆడింది ఆటైంది
ఆర్.టి.సి ! వద్దు ఆగ్రహమ్ము!

### అంటరానితనము

కొల్లబెట్టి డబ్బు ఇల్లుగట్టించొచ్చు
చదువు సాము నేర్చి సాకవచ్చు
కొలువు లివ్వవచ్చు కొనదాకపోబోదు
అంటరానితనము, అదొక జాడ్యం!

### చీఫ్ మినిస్ట్రు !

కత్తిలేని పచ్చికాంగ్రెసు భక్తుల్ని
నీకు దగ్గరోళ్ళ మీలా వాళ్ళ
కవిని పేదవాళ్ళ కాసంతదయబెట్టు
చీఫ్ మినిస్ట్రు ! లేమిచెదరగొట్టు

## చిత్ర సమీక్ష

(7పేజీకొరవ)

కన్నడ భాషాచిత్రాలనిర్మాత వి. రవిచంద్రన్ ఈ చిత్రాన్ని నిర్మించటమేగాక, కథ, స్క్రీన్ ప్లే వ్రాసి దర్శకత్వంగూడా వహించాడు. భరత్ పాత్రలో నటించాడు.

కథను నడిపించటంలో దర్శకుడుకొత్తపోకడలు పొయ్యాడు. సాంకేతిక విలువలు చిత్రంలో బాగా సంతరించుకున్నాయి. చిత్రంలో ఎక్కువగా మాస్టర్ అమిత్, బేబీ కీర్తి, బేబీ సంగీత, బేబీఅశ్విని లాంటి బాల నటీనటులు కనిపిస్తారు. చాలా భాగం పాటలుగూడా ఎక్కువగా పిల్లల మీదే చిత్రీకరించ బడ్డాయి. ఫైటింగుదృశ్యాలు చూపే సందర్భాల్లో యాంత్రికంగా నడిచే ఆటబొమ్మలకదలికలు, ఆకాశంలో రిమోట్‌కంట్రోలరుతో ఎగిరే విమానాలు చాలా చక్కగా చూపబడ్డాయి. ఇవన్నీ బాలప్రేక్షకులను ఆనందపరిచి ఆకర్షిస్తాయి.

అక్కినేని నాగార్జున విజృంభించి నటించాడు. జుహీచావ్లా నటన బాగుంది. వి. రవిచంద్రన్‌కూడా బాగా నటించాడు. భరత్ సహచరిణిగా ఖుష్బూ పుష్కలంగా శృంగారం అందించింది. అనంతనాగ్ నటన మెచ్చుకోతగింది. వేటూరి, సిరివెన్నెల పాటలు హంస లేఖసంగీతంలో శ్రావ్యంగావున్నాయి.

## సినిమా

(7పేజీ కొరవ)

కొట్టుప్రారంభోత్సవం చేయడానికి నటి రూపిణిని పిలిస్తే, కొన్నివేలు చెల్లించాలని అడిగిందట. ఆ కొట్టతను ధనికుడవడం వల్ల అందుకు సమ్మతించాడు. ఆమె రిబ్బన్ కత్తిరించబోతున్నప్పుడు ఎదురుగా వీడియో కెమెరాలు కనిపించేసరికి, ఆమె వెనుకంజవేసింది. "మీరు నన్ను రిబ్బన్ కత్తిరించడానికే పిలిచారు. నన్ను వీడియో తీయాలంటే అదనంగా మరో అయిదువేలు చెల్లించాలి." అని పట్టుబట్టిందట.గత్యంతరం లేక ఆమెకు అంత డబ్బు చెల్లించక తప్పలేదా కొట్టు ఆసామికి. తారల ఆశకు అంతుఎక్కడిది?

### ఛాంపియన్

భార్యా భర్తలమధ్య విభేదాలకు సంబంధించిన ఇతివృత్తాన్ని డి.వి.ఎస్. ఎంటర్ ప్రైసెస్ వారు" ఛాంపియన్ " చిత్రంలో కొత్తకోణంలో చూపిస్తారట. శోభన, వినోద్‌కుమార్, బ్రహ్మానందం, బాబూమోహన్, విద్యాసాగర్, సుధారాణి, మాస్టర్ ఆదిత్య వగైరా నటవర్గం. కథ, మాటలు: పరుచూరి సోదరులు. పాటలు: వెన్నెలకంటి. సంగీతం: విద్యాసాగర్ .నిర్మాత: డి.వి.ఎస్. రాజు. దర్శకత్వం: వై. నాగేశ్వర రావు.

## పంచాంగం

తేది7 సోమవారముమహాలయమావాస్య.
తేది 8 మంగళవారము దేవి నవరాత్రి ఉత్సవములు ప్రారంభము, కలశస్థాపన.

### అక్టోబరునెల తిథులు

భాద్రపద బహుళపక్షము :-
తేది 5 శని ద్వాదశి ఉదయము గంట 7.25 వరకు తరువాత పూర్తిగ త్రయోదశి
తేది 6 ఆది చతుర్దశి రాత్రి గంట 4.15 వరకు
తేది 7 సోమ అమావాస్య రాత్రి గంట 2.45 వరకు
ఆశ్వయుజ శుక్లపక్షము :-
తేది 8 మంగళ పాడ్యమి రాత్రి గంట 2.05 వరకు
తేది 9 బుధ విదియ రాత్రి గంట 1.48 వరకు
తేది 10 గురు తదియ రాత్రి గంట 2.10 వరకు
తేది 11 శుక్ర చతుర్థి రాత్రి గంట 2.57 వరకు

– స్వయం పాకుల
శ్రీనివాసులు ఎం.వి

---

స్పెషల్ జ్యూడిషియల్ ఫస్ట్ క్లాసు మేజిస్ట్రేటు మొబైల్ కోర్టు, నెల్లూరు:

M.C.No. 31/1991

1. సయ్యద్ షమీమ్
మరియు ఇద్దరు ఇతరులు - పిటిషనర్లు

Vs

సయ్యద్‌నయీద్ బాషా రెస్పాండెంటు

నోటీసు

To
సయ్యద్ నయీద్ బాషా,
S/oరహమ్‌తుల్లా నవాబ్ జాన్,
8/268, రంగనాయకులపేట,
నెల్లూరు.

పైకేసు నోటీసు నిమిత్తం 10.10.1991 కి వాయిదా వేయబడివున్నది. కావున ఆరోజు వుదయం 10.30 గంటలకు పైకోర్టుకుహాజరయి నీ ఆక్షేపణలు తెలుపుకోవచ్చును. లేనిచో నీ పరోక్షమందు విచారించి తీర్మానించెదరు.

పుచ్చలపల్లి రఘురామిరెడ్డి
అడ్వకేటు ఫోన్ నం:28815
ట్రంకురోడ్డు, నెల్లూరు.

---

### ప్రకటన

IN THE COURT OF THE III RD ADDL. DIST .. MUNSIFF: NELLORE.

O.S. No: 1228/89.

Union Bank of India, Planitiff
Kakupalli

1. Chevuru Sundarami reddy and another ---Defendants

పై నంబరున కోర్టువారి అనుమతిప్రకారం ఈ పబ్లికేషన్ ఇవ్వడమైనది. పైనంబరున 1వ ప్రతివాది చేవూరు సుందర రామిరెడ్డి, 2వ ప్రతివాది చేవూరు సుధాకరయ్య అను వారికి దావా నోటీసు జారీ నిమిత్తము పబ్లికేషన్ ఇవ్వడమైనది. కావున పై ప్రతివాదులు పై కోర్టులో 23.10.91 తేదిన ఉదయం 10 గంటలకు హాజరై తమ ఆక్షేపణలు తెలుపుకొనవలయును:లేనిచో కేసును మీ పరోక్షమున విచారించి తీర్మానించబడును.

N. Sreenivasulu Reddy,
B.Sc.B.L
వాయిదా వాది తరుపుఅడ్వకేట్
తేది 23.10.91

## తాటిచెట్టు

(4 పేజీ కొరవ)

పెరిగే చెట్లరకాలను పరిశోధన ద్వారా అమలుకు తెస్తున్నారు.

కొబ్బరి రకాలు కొత్తగా ఎన్ని వచ్చినవి! తక్కువ కాలంలో ఎంత ఎక్కువగా ఫలసాయం నిస్తున్నది మనకు తెలుసు.

వ్యవసాయ పరిశోధనాశ్రమ బహుముఖంగా ఇంత ముమ్మరంగా జరుగుతున్నా, దేనికి దానికి, ఎక్కడికక్కడ పరిశోధనా స్థానాలు నెలకొల్పబడుతున్నా మన గ్రామీణ జీవనంతో పెనవేసుకొని, ఎన్నిలక్షల కుటుంబాలకో నీడను: ఫలాదిని కల్పిస్తూ, ప్రభుత్వానికి కోట్లాది రూపాయల ఆదాయాన్నితేకూర్చి పెడుతూ, విదేశీ ద్రవ్యాన్ని అపారంగా ఆర్జించిపెట్టగల అత్యంత విలువైన తాటిచెట్ల పరిశోధనమీద వ్యవసాయశాఖవారికి శ్రద్ధలేకపోవడం, వ్యవసాయపరిశోధకులకు ఆసక్తి లోపించడం, వర్షాభావగ్రస్త రైతుకుటుంబాలకు అత్యధికంగా చెందిన పాలకులైన రాజకీయనాయకులకు పట్టకపోవడం మనదురదృష్టమనే అనాలి! ఇప్పటికైనా మించిపోయిందిలేదు; పాలకులు పరిశోధకులు మేలుకొని చర్యలు తీసుకోగలిగితే గ్రామీణార్థిక వ్యవస్థకు, తద్వారా దేశాభివృద్ధికి ఎంతో దోహదకారి అవుతుంది.

తాటికి సంబంధించి రెండు విధాలైన పరిశోధన జరగాలి. ఒకటి - తక్కువకాలంలో పెరిగి అధికదిగుబడి నిచ్చే రకాలను కనుగొనాలి. అదేవిధంగా సంకరజాతి, టిష్యుకల్చర్ ప్రక్రియద్వారా మొక్కలను ఎక్కడికైనా తీసుకపోయి నాటేందుకు ఉపకరించే రకాలు పరిశోధన ద్వారా రావాలి. అక్కడక్కడ బహుళఫలం తాటిచెట్లు ఉంటున్నాయి ; అటువంటి రకాలను అభివృద్ధి చేయగలగాలి.

రెండవది - తాటి ఫలసాయాన్ని వాణిజ్యపరంగా ఉపయోగించుకొని తత్సంబంధమైన గ్రామీణ పరిశ్రమలు అభివృద్ధిగావించుటకు విదేశీ ఎగుమతులకు అనుకూలంగా వాటినిఉపయోగపెట్టుకొనే పరిశ్రమలను వృద్ధిచేయుటకువుండే అవకాశాలను పరిశోధించాలి. ద్విముఖమైన ఈ పరిశోధన వెంటనే ప్రారంభంకాగలిగితే ఎంతో ప్రయోజనం చేకూరుతుంది.

మన వ్యవసాయ పరిశోధకులలో వర్షాభావాల్లో మైదాన ప్రాంతాలలో పుట్టిపెరిగినవారు తక్కువయినా, వ్యవసాయకుటుంబాలనుండి వచ్చినవారిసంఖ్య అల్పమేమీకాదు. అటువంటివారుకూడా తాటివంటి కొత్త అంశంమీద ఉత్సుకత ఎందుకు చూపలేకపోతున్నారో. ఏ. పి. హెచ్.డిలు అంతకుపైబడిన పట్టాలకు ఇది ఎందుకు ఒకపరిశోధనాంశం కాలేకపోతున్నదో ఆశ్చర్యం.

ఉత్సాహవంతులైన వ్యవసాయపరిశోధకులు, రైతుకుటుంబీకులైన డాక్టర్ ఎస్. ఈశ్వర రెడ్డి గతంలో రెండు పార్ట్ల తాటిపరిశోధనమీద పథకాలు సమర్పించినట్లు జ్ఞాపకం. 8 లక్షల రూపాయల వ్యయంతో తాటిచెట్ల అభివృద్ధికి కావలిలో ఒక పరిశోధనా కేంద్రాన్ని నెలకొల్పవలసిందిగా భారత వ్యవసాయ పరిశోధనామండలి - ఢిల్లీకి ఒక పథకం పంపారు. అప్పటి మండలిసభ్యులైన శ్రీ బెజవాడ పాపిరెడ్డి ఆ పథకానికి నిధులమంజూరుకు ప్రోత్సహించారు. కాని ఇంతలోనే పార్లమెంటు ఎన్నికలు రావడంతో ఆ ప్రయత్నం కాస్త పిల్లెత్తుకపోయింది!

అదే డాక్టర్ ఈశ్వరరెడ్డిగారు రాష్ట్ర ఎక్సయిజ్ - అబ్కారీశాఖ వారు తాటిచెట్ల అభివృద్ధి పరిశోధన చేపట్టేట్లుంటే:తమశాఖలు నిధులు సమకూర్చగలవని ప్రతిపాదించిన మీదట యాభైలక్షలు ఖర్చయ్యే ఒక పథకాన్ని రూపొందించి ఆంధ్రవ్యవసాయ విశ్వవిద్యాలయానికి సమర్పించినట్లు తెలిసింది. కాని ఈశ్వరరెడ్డి మండలాభిమానంతో కాబోలు అందులో ఒక షరతు చొప్పించినట్లున్నాడు- ఆ పరిశోధనాలయాన్ని నెల్లూరులో నెలకొల్పమని కోరాడు. విశ్వవిద్యాలయ పరిశోధనా సమన్వయ శాఖాధిపతి దాన్ని ఒక సవరణతో ఒకేచేసి ఎక్సయిజ్ శాఖకు సమర్పించాడట. ఆసవరణ పరిశోధనకు సంబంధించినది కాదు. ఆ పరిశోధనాకేంద్రాన్ని పశ్చిమగోదావరిలో స్థాపించమని మాత్రం సవరించాడట. ఆయన ఆజిల్లాకు చెందినవాడేమోతెలియదు. ఏమైతేనేమి ఆపథకం అంతటితో సరి; దానిమీద ఎటువంటి చర్యాలేదు. ఈశ్వరరెడ్డి మంచి ముహూర్తం చూచి ఆ పథకాలు సమర్పించినట్లులేదు.

గతజల సేతుబంధనం వృథా! జరిగిందేమో జరిగిపోయింది. ఇప్పటికైనా ఆంధ్రవ్యవసాయ విశ్వవిద్యాలయం ఈ పథకాన్ని పునరుద్ధరించి, నిధులు మంజూరుచేసి, పరిశోధనా స్థానాన్ని నెలకొల్పే కృషికి ఉపక్రమించడం అవసరం. పరిశోధనా కేంద్రం నెల్లూరుజిల్లాలో స్థాపించాలనే పట్టుదల అనవసరం. తాటిచెట్ల సంఖ్య ఏ ప్రాంతాలలో ఎక్కువగా ఉంటే ఆప్రాంతానికి కేంద్ర స్థానంగావుండేటట్లు నెలకొల్పబడాలి. పరిశోధనాకేంద్రాలు ఒక జిల్లాకు, ఒక రాష్ట్రానికి పరిమితమయినవి కావు. దేశానికంతటికీ చెందినవి. వ్యవసాయ పరిశోధనాఫలితాలను విశ్వవ్యాప్తంగా వెదజల్లేవి. అందువల్ల ప్రదేశాన్నిగూర్చి వివాదపడవల్సిన అవసరంలేదు.

ముఖ్యమంత్రి శ్రీ జనార్ధనరెడ్డిగారికి వ్యవసాయ పరిశోధనమీద మక్కువ ఎక్కువ. ఆయన ఈ విషయంలో ప్రత్యేకంగా చొరవతీసుకొని, నిధులు సమకూర్చి తాటిచెట్ల అభివృద్ధి కేంద్రం తన హయాంలో నెలకొల్పుటకు చర్యలు తీసుకోవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాము.

## పోతన

(4పేజీకొరవ)

పదాలు అవి ప్రయోగింపబడిన సందర్భాన్ని బట్టి, లేదా ఉచ్చరింపబడిన తీరును బట్టి, వేర్వేరు అర్థాలను ప్రకటిస్తుంటాయి. నన్నయ భారతంలో ఒకచోట ఇదే "ఘనుడు" అన్న వ్యంగ్య ధోరణిలో ప్రయోగింపబడి వుంది. దుర్యోధనుని జనన సందర్భాన్ని వర్ణిస్తూ "ఘనుడు పుట్టె కలియంశమునన్" లోకజ్ఞుడైన నన్నయ్య కలియంశమునందు పుట్టినవాణ్ణి "ఘనుడు" అన్న పదంతో గౌరవిస్తున్నాడు! అతగాడు పుట్టిన వెంటనే సృష్టిలో పొడమాపిన అన్ని ఉత్పాతాలను గూర్చి అనేనుక వర్ణించడోతూ ముందుగా "ఘనుడు" అన్న శబ్దప్రయోగం కావిస్తున్నాడంటే, 'మహానుభావుడు', మహాత్ముడు అన్న అర్థంతో వసేమిరాకాదు. ఇదికేవలం వ్యంగ్య గర్భితంగాఅన్నమాటే. ఈ నాటికీ 'ఘనుడు', 'మహానుభావుడు', 'మహాత్ముడు' మొదలైన పదాలను ఈసడింపుగా, వెక్కిరింతగా, నర్మగర్భంగా ప్రయోగించడం మన అందరి అనుభవంలో వున్నదే. ఎన్నడూ రాక, ఏదోఒకప్రయోజనాన్ని మనస్సులో పెట్టుకొని మన యింటికి వచ్చేవారిని "ఊరక రారు మహాత్ములు" అంటూ ఎగతాళి ధ్వనించే స్వాగత వాక్యం తో పలుకరించే అలవాటు మనందరికీవున్నది. ఎటు వచ్చీ కొన్ని చోట్ల మనం గేస్తులుగా వుండి యిలా అంటాం, కొన్ని చోట్ల అతిథులుగా వెళ్ళి ఈ మాట వింటాం. ఈ "ఊరకరారు మహాత్ముల"న్న ప్రయోగం పోతన భాగవతంలోనూ వున్నది. కవుల పలుకులనర్థం చేసుకొనేందుకు కేవలం నిఘంటువులు చాలవనేందుకు, ఎంతో కొంత లోకజ్ఞత వుండి తీరాలి అనేందుకు ఈ "ఘనుడు" శబ్దం ఒక చక్కటి నిదర్శనం కాగలదు.

## గ్రంథసమీక్ష

(4 పేజీకొరవ)

నిరంతరం కాపాడుచుండెను. మొదట పిచ్చివానిగా తలచిన ప్రజలు పిమ్మట భక్తి ప్రపత్తులతో పూజింపసాగిరి. తుదకు స్వామి వారు నెల్లూరు జిల్లా వెంకటాచలం మండలములోని గొలగమూడి గ్రామంలోనివాసము ఏర్పరచుకొనిరి. ఇప్పుడు గొలగమూడి ఒక పుణ్యక్షేత్రము1982 వ సం॥ ఆగస్టు నెల24 న స్వామివారు తన దివ్యదేహమును విడిచిరి. త్రాగుబోతు అగ్నిగుండమునకు కట్టెలు తెచ్చి బండిని ఆపగా స్వామి కోపపడిన వెంటనే "రాయివలె విరిచి పోయినా త్రాగుబోతు" స్వామి వానిని క్షమించగా వాడు భక్తుడయ్యెను.

శ్రీ లింగరాజుగారి కమనీయ కవితకు ఒకటి రెండు పద్యములు —

॥ చేతతాటాకు బుట్టయు, చినుగులున్న
చీరయును బక్క, చిక్కు, శరీరమున సు
తనువు దాల్చిన వాడు పేదతనమునంగ
వచ్చు కవ్వల యూహాది పవిత జాడి.
॥ పరమకరుణార్ద్ర చిత్తుడే స్వామితనదు
శిష్యులకు వాసి జూపించి, తేరిచిలిచి
అన్నమును,నీరతోడరూప్యములుపదియు
విచ్చి సాదరంబుగను పంపించు దనియె

## సింహపురి

(4 పేజీకొరవ)

### బుజబుజ నెల్లూరులో లక్షతులసి పూజ

బుజబుజనెల్లూరులో శ్రీరామాలయంలో నవంబరు 24 వతేది లక్షతులసిపూజ, కళ్యాణం, జరిపేందుకు ఏర్పాట్లు చేస్తున్నారు. ఈ సందర్భంగా పదకొండువందలు విరాళమిచ్చినవారికి రెండున్నర గ్రాముల బరువుగల కోదండరాముని బంగారు ముద్రిక, 50 రూపాయలు విరాళమిచ్చిన వారికి వెండి ముద్రికలు ఇవ్వబడతాయి. వివరాలకు 27518 నంబరుకు ఫోన్‌చేయమని ధర్మకర్తల మండలి సభ్యులు కోరుతున్నారు.

# ప్రథమ వర్ధంతి

మా అభ్యున్నతికి కారకులు

## శ్రీ కంచర్ల శేషయ్య నాయుడుగారు



చిరమన

స్వర్గస్థులై 6 – 10 – 1991 తేదికి

సంవత్సరం గడిచింది

ప్రథమ వర్ధంతి

సందర్భంలో వారిని సంస్మరించుకొంటున్నాము

కంచర్ల సరోజనమ్మ – భార్య

కుమారులు – కోడళ్ళు : సుధాకర్ నాయుడు – శేషమ్మ

డా॥ రవీంద్రనాథ్ B.Sc, M.S, F.R.C.S (ED), F.R.C.S; ఆదిలక్ష్మి

డా ॥ రమేష్ M.D పద్మ, రమాధర్‌నాయుడు B.E

కుమార్తెలు – అల్లుళ్ళు : దామినేని ప్రభావతి – రామానాయుడు;

యు.లక్ష్మి – శ్రీరాములు నాయుడు; టి.సరస్వతి – కృష్ణయ్య నాయుడు

మనుమలు – మనమరాండ్రు



ఆర్యా

# శ్రీ రాజరాజేశ్వరి అమ్మవారి దేవస్థానం

దర్గామిట్ట– నెల్లూరు – 4.ఫోన్ : 22016

# నవరాత్రి బ్రహ్మోత్సవ ఆహ్వానము

## 8 – 10 – 91 తేది నుండి 17 – 10 –91 తేది వరకు

శ్లో అంబా శాశ్వత ఆగమాది వినుతా ఆర్యా మహాదేవతా
యా పంచ ప్రణవాది రేఫజననీ యా చిత్కళామాలినీ
యా బ్రహ్మాది పిపీలికాంత జననీ యాచై జగన్మోహినీ
చిత్రూపి పరదేవతా భగవతీ శ్రీ రాజరాజేశ్వరీ ।

సింహపురి దర్గామిట్టలో వేంచేసియుండు శ్రీ రాజరాజేశ్వరి అమ్మవారి దేవ స్థానమునందు నవరాత్రి బ్రహ్మోత్సవములు శ్రీ ప్రజాపతి సంవత్సర ఆశ్వీయుజ శుక్ల ప్రతిపత్ తేది 8.10.91 మంగళ వారము మొదలు 17.10.91 తేది గురువారం వరకు జరుగును. ప్రతిదినము ఉదయము 8.00 గంటలనుండి 12.00 గంటల వరకు విశేష నవావరణ, అష్టోత్తర, సహస్ర నామపూజలు జరుగును. కావున భక్తులు , ఉభయకర్త లెల్లరు పాల్గొని కార్యక్రమములు జయప్రదముచేసి శ్రీ రాజరాజేశ్వరి అమ్మవారి కరుణాకటాక్షములకు పాత్రులగుదురని ప్రార్థించుచున్నాము.

## ఉత్సవ కార్యక్రమములు

| తేది | వారము | తిథి | అలంకారము | ఉభయకర్తలు |
|---|---|---|---|---|
| 8.10.91 | మంగళవారము | పాడ్యమి | ఉదయం 9.15 గంటలకువృశ్చికలగ్నమున "కలశస్థాపన.చండీఅలంకారము | శ్రీ ఆర్. వెంకటేశ్వరరావుగారు. పోస్టల్ కాలనీ. నెల్లూరు -4. |
| 9.10.91 | బుధవారము | విదియ | భవాని అలంకారము | శ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డిగారు M.P.:సుధాకర్ రెడ్డి. శ్రీనివాసులురెడ్డి. నెల్లూరు. |
| 10.10.91 | గురువారము | తదియ | గాయత్రి అలంకారము | శ్రీ అనపల్లి అశోక్ కుమార్ రెడ్డిగారు , కోవూరు. |
| 11.10.91 | శుక్రవారము | చతుర్థి | అన్నపూర్ణఅలంకారము | శ్రీమతి దేవిరెడ్డి శైలజమ్మగారు. మద్రాసు |
| 12.10.91 | శనివారము | పంచమి | గజలక్ష్మి అలంకారము | శ్రీపి. ఓబుల్ రెడ్డిగారు,మేనేజింగ్ డైరెక్టర్.ఇండోనేషనల్‌లిమిటెడ్(నిప్పో),నెల్లూరు-4 |
| 13.10.91 | ఆదివారము | షష్ఠి | కాళికాదేవి అలంకారము | శ్రీచెన్నారెడ్డి సతీష్‌కుమార్ రెడ్డిగారు. ఇండికేర్ మెడికల్స్. నెల్లూరు. |
| 14.10.91 | సోమవారము | సప్తమి | సరస్వతి అలంకారము | శ్రీ బి. మధుసూదన రెడ్డిగారు. శ్రీమతి బి. రజనిగారు. అమెరికా |
| 15.10.91 | మంగళవారము | అష్టమి | దుర్గా అలంకారము | శ్రీ ఆర్. వెంకట్రామయ్యనాయుడుగారు. నెల్లూరు. |
| 16.10.91 | బుధవారము | నవమి | మహిషాసురమర్దని. సువాసినిపూజ | శ్రీమతి ఆనం అమ్మణ్ణమ్మగారు. నెల్లూరు. |
| 17.10.91 | గురువారము | దశమి | శ్రీ రాజరాజేశ్వరి అలంకారము. శమీపూజ.పారువేట, గ్రామోత్సవము | శ్రీబక్కా కోదండరామి రెడ్డిగారు M.L.A., నెల్లూరు. |

## ప్రత్యేక కార్యక్రమాలు

| తేది. వారము | సమయం | కార్యక్రమము | ఆర్థిక సహాయము అందజేసినవారు |
|---|---|---|---|
| 8.10.91 మంగళవారం | రాత్రి 7 గం ।నుండి | శ్రీ రామప్రసాద్ కళానిలయం నెల్లూరు వారిచే శ్రీ కృష్ణసత్య అనుపౌరాణిక నాటకము. | శ్రీ ఆర్. వెంకటేశ్వర రావుగారు. పోస్టల్ కాలనీ. నెల్లూరు - 4. |
| 9.10.91 బుధవారం | రాత్రి 7 గంll నుండి | శ్రీమతి శోభారాజ్ అండ్ పార్టీ హైదరాబాదు వారిచే అన్నమాచార్య కీర్తనలు | శ్రీ మాగుంట సుబ్బరామి రెడ్డిగారు M.P.:సుధాకర్‌రెడ్డిగారు శ్రీనివాసులు రెడ్డిగారు. నెల్లూరు. |
| 10.10.91 గురువారం | రాత్రి 7 గంll నుండి | ధ్వన్యనుకరణ సామ్రాట్ శ్రీ నేరెళ్ళ వేణుమాధవ్ ( వరంగల్) గారిచే మిమిక్రీ కార్యక్రమము. | శ్రీ అనపల్లి అశోక్ కుమార్ రెడ్డిగారు,కోవూరు. |
| 11.10.91 శుక్రవారం | రాత్రి 7గంll నుండి | ప్రపంచ ప్రఖ్యాత కర్ణాటక విద్వాంసులు శ్రీమతి సరోజ మరియు శ్రీమతి లలిత ( బాంబేసిస్టర్స్) మద్రాసు వారిచే కర్ణాటక సంగీత కచేరి. | దేవస్థానము |
| 12.10.91 శనివారం | రాత్రి 7 గం। నుండి | ఇంటర్‌నేషనల్ డాన్స్ అలియన్స్ లిమిటెడ్ మద్రాసు వారిచే కృష్ణం వందే జగద్గురుం అను నృత్య నాటిక డైరెక్టర్ డా॥ పద్మశ్రీ సుధారాణి. రఘుపతి. | శ్రీ పి ఓబుల్ రెడ్డిగారు మేనేజింగ్ డైరెక్టర్. ఇండోనేషన్ లిమిటెడ్(నిప్పో). నెల్లూరు. |
| 13.10.91 ఆదివారం | రాత్రి 7గంll నుండి | సుమధుర కళానికేతన్ బృందం విజయవాడ వారిచే " సుమధుర హాస్యవిభావరి" | శ్రీ చెన్నారెడ్డి సతీష్ కుమార్ రెడ్డిగారు. ఇండికేర్ మెడికల్స్. నెల్లూరు. |
| 14.10.91 సోమవారం | రాత్రి 7గంll నుండి | ప్రపంచ ప్రఖ్యాత ఇంద్రజాలకులు శ్రీ బి.వి. పటాభిరాం బృందం ( హైదరాబాదు) వారిచే మ్యాజిక్ షో ( ఇంద్రజాలము ) | దేవస్థానము |
| 15.10.91 మంగళవారం | రాత్రి 7 గంll నుండి | ఈలపాట చక్రవర్తి శ్రీ శివప్రసాద్ అండ్ పార్టీ హైదరాబాదు వారిచే ఈలపాట కచేరి | శ్రీ ఆర్ వెంకట్రామయ్య నాయుడు, నెల్లూరు. |
| 16.10.91 బుధవారం | రాత్రి 7 గంll నుండి | హాస్యకథా చక్రవర్తులు టి.వి. రేడియో ఆర్టిస్టులు విట్టం బ్రదర్స్ ముమ్మడివరం వారిచే బుర్రకథ. | దేవస్థానము |
| 17.10.91 గురువారం | రాత్రి 7గంll నుండి | అంతర్జాతీయ కళకారులు పద్మశ్రీ యస్. రమణి అండ్ పార్టీ మద్రాసు వారిచే పిల్లన గ్రోవి ( ఫ్లూట్ ) కచేరి. | శ్రీ బక్కా కోదండరామిరెడ్డి గారు M.L.A., |

**19.10.91 తేది శని వారం మధ్యాహ్నం 12.00 గంటలకు దేవస్థానం వారిచే " అన్నదానం "**

విద్యుత్ దీపాలంకరణ : శ్రీ వాసిరెడ్డి వెంకటేశ్వర రావు అండ్ పార్టీ. కాపువీధి , నెల్లూరు. పుష్పాలంకరణ : శ్రీ జె.వెంకయ్య శ్రీ రాజరాజేశ్వరి ఫ్లవర్ స్టాల్ , దుర్గామిట్ట. నెల్లూరు
బ్యాండు మేళం : శ్రీ రామూరు రమణయ్య అండ్ పార్టీ. ముత్తరాజావారివీధి. నెల్లూరు. అలంకార సమర్పణ: యం క్రిష్ణమాచార్యులు అండ్ సన్స్. దర్గామిట్ట , నెల్లూరు.

- భవదీయులు -

కోడూరు వెంకటరామిరెడ్డి. ఛైర్మన్ పనువులేటి మాధవయ్య. బాలాజీ నరేంద్రప్రసాద్ . శ్రీమతి ఉగ్గుమూడి వసుంధరమ్మ. శ్రీమతి చిటుకూరు భాగ్యలక్ష్మి. ట్రస్ట్‌బోర్డు సభ్యులు

విజ్ఞప్తి: దేవాలయమునకు విచ్చేయు భక్తులు క్రమశిక్షణతో నడుచుకొనవలయును. కానుకలు చెల్లించువారుఆఫీసులో చెల్లించి అచ్చు రశీదు పొందవలయును.
గమనిక :- దేవస్థానము వారిచే గ్రా త్సవమునందు శ్రీ సాంబశివరావు అండ్ పార్టీ తెనాలి వారిచే ప్రత్యేక బ్యాండుమరియు యస్. చిట్టిబాబు అండ్ పార్టీ బేతాళబృందము. విజయవాడ వారిచే ఛాఛాద నృత్యములు.

Edited, Printed and Published by N.Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET Printing at Nayagara Books Pvt, Ltd, Nellore